# యువభారతి

(ప్రథమ సంపుటి)

"శీలేన శోభతే విద్యా"

సంకలనం

మన్నవ గిరిధరరావు, ఎం. ఏ.
ఎం. ఎల్. సి.



ప్రచురణ

యువభారతి ఎడ్యుకేషనల్ సొసైటి

3/17 బ్రాడీపేట, గుంటూరు-2



మూల్యము
రెండున్నర రూపాయలు

# నివేదనము

గత రెండుసంవత్సరాలుగా మేము విద్యార్థులనుద్దేశించి "యువభారతి" మాసపత్రిక ప్రచురిస్తున్నాం. వాటిలో వెలువడిన రచనలను పుస్తకరూపంలో పునర్ముద్రించి పాఠకులకందజేస్తున్నాం.

విద్యాలయాల్లో బోధింపబడుతున్న పాఠ్యప్రణాళికలో ఏదో వెలితి కనిపిస్తూవున్నది. యాంత్రికంగా అనేకం బోధింపబడుతున్నాయి. వాటిలో జీవితానికి వెలుగుచూపే విషయాలు అంతగా వుండడంలేదు. విద్యాలయంనుండి వెలుపలికి వస్తున్న యువకుడు క్రియాశీలిగా రూపొందడంలేదు. ఒక కార్యసాధనకై జీవితాన్ని అంకితంచేసే ఆకాంక్ష అతనిలో కలగడంలేదు. సంఘంలో ఎలామెలగాలో గ్రహించడంలేదు. దేశమనెడి పరిధికిలొంగివుండి వ్యవహరించాలని గుర్తించడం లేదు.

ఇట్టి విషయాలు యువకులకు గుర్తుచేయడం కొరకే "యువభారతి" ప్రారంభించాము. అనతికాలంలోనే మాకుచక్కని ప్రోత్సాహం లభించింది. ప్రతినెల 7000 ప్రతులు రాష్ట్రంలో అన్నిజిల్లాలకూ వెళుతున్నాయి. సంవత్సరానికొకమారు అందలిరచనలను సంకలనంగా వెలువరచాలని సంకల్పించాం.

విద్యారంగంలో కృషిచేస్తున్న మిత్రులు శ్రీ మన్నవ గిరిధరరావు, (ఎం. ఎల్. సి.,) ఇట్టి ప్రయత్నం యొక్క ఆవశ్య కతనుగుర్తించి ఈ ప్రచురణలకు సంపాదకత్వం వహించారు. స్వల్పవ్యయంతో అత్యధికులైన విద్యార్థులకు నిర్మాణాత్మక మైన ఆలోచనలు అందించడమే మా లక్ష్యం.

ఉద్దేశించినది పిన్నలకే అయినప్పటికీ పెద్దలుసహితం దీనిని చదివి ఆనందించగలరు. ఆరంభంనుండీ మమ్మలను ఈ కృషిలో ముందుకునడిపిస్తున్న ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి గా॥ శ్రీ పి. వి. నరసింహారావుగారికి ధన్యవాదము లర్పిస్తు న్నాం.

ఈ యత్నాన్ని ద్విగుణీకృత మొనర్చడానికి పాఠకుల నుండి సూచనలను ఆహ్వానిస్తున్నాం.

బేగంపేట
హైదరాబాదు—16

పిడతలరంగారెడ్డి,
చైర్మన్, ఆంధ్రప్రదేశ్ లెజస్లేటివ్ కౌన్సిల్
అధ్యక్షులు, యువభారతి ఎడ్యుకేషనల్ సొసైటీ.

# విషయసూచిక

# ప్రపంచంలోకెల్ల విలువైన పదార్థం

"పార్లమెంటు సభ్యులు తయారుచేసే చట్టాలద్వారా ఏ జాతీ ఉన్నతదశ చేరుకోదు. ఆ దేశపు ప్రజలు ఉత్తములు అయితేనే జాతి ఉన్నత స్థాయినందుకుంటుంది. దేశంలోని యావత్తు సంపదకంటె గూడా వ్యక్తులయొక్క విలువ అధికం. ఒకవేళ మనకుకావలసిన అవసరాలనన్నిటినీ ప్రభుత్వం సమకూర్చినా, వాటిని సద్వినియోగపరచుకోగల శీలవంతులైన వ్యక్తు లేరీ ? కనుక అట్టి మనుష్యులను ముందు తయారుచేయండి."

స్వామి వివేకానంద నుడివిన పై మాటలలో ఎంతో సత్యం కన్పిస్తున్నది. ప్రజలకు మేలుచేకూర్చే అనేక చట్టాలు అమలులోవున్నాయి. ఆహారపదార్థాలలో కల్తీ నిషేధించే చట్టంచేయబడింది; అస్పృశ్యతను చట్టరీత్యానిషేధించారు. అయినప్పటికీ ఆయా శాసనాలవలన దోషములు నివారింపబడడం లేదని చెప్పవలసివస్తుంది.

అదేవిధంగా ప్రజలయొక్క అవసరాలను తీర్చడంకొరకు కోట్లకొలది రూపాయలు వెచ్చించబడుతున్నాయి. దేశంలో వస్తువులఉత్పత్తిపెరిగింది. కుగ్రామాలకుసహితం విద్యుచ్ఛక్తి సరఫరాచేయబడుతున్నది. ప్రతిగ్రామాన గ్రామపంచాయితీ ఏర్పరచబడింది. అయినప్పటికీ ఏదోలోటు కనిపిస్తూనే వున్నది. ఇవ్వబడిన అవకాశాలు సద్వినియోగపరచుకోవడానికి అవసరమైన శీలసంపద లోపించడంవల్ల ఎటుచూచినా నిరాశా నిస్పృహాలు కానవస్తున్నాయి.

నిజానికి ప్రపంచంలో కెల్లా విలువైన వస్తువేది? బంగార మని మనకు తెలుసు. సువర్ణముకొరకు ప్రజలు అర్రులుజాస్తారు. వివిధ దేశాలమధ్య లావాదేవీలు బంగారంతో నడుస్తాయి. చెలామణిలోవున్న రూపాయినోట్లకు ప్రభుత్వం బంగారాన్ని హామీగా వుంచుతుంది.

కాని బంగారంకంటేనూ, ప్రపంచంలోని ఏ ఇతర పదార్థం కంటేనూకూడ విలువైనవాడు మానవుడే! అతడే అన్నిటినీ ఉత్పత్తిచేస్తున్నాడు; అతడే వినియోగిస్తున్నాడు; అతడే ఈనాడు భూమికీ ఇతర గ్రహాలకూ నడుమ వారధి కడుతున్నాడు. అతనిచర్యలవల్లనే దేశానికి ఉన్నతిగాని, పతనంగాని ఏర్పడుతుంది.

దేశంలో వస్తూత్పత్తి పెంచడంకోసం ప్రణాళికలు ప్రవేశపెట్టబడ్డాయి. జాతీయ ఆదాయం పెరగడంకోసం కృషి జరుగుతున్నది. ప్రజలకు ఇతోధికంగా రాజకీయ అధికారం లభిస్తున్నది. కాని ఈ ప్రణాళికల విజయానికి అవసరమైన 'మనుష్యు'ని రూపొందించడానికిమాత్రం పథకాలులేవు. అందుచేత జరుగుచున్న కృషి అడుసులో నాటిన స్తంభంవలె ఊగులాడుతున్నది. "హిందూదేశపు సమస్య ఆర్థికమైనదీ కాదు, రాజకీయమైనదీకాదు. అది మనుష్యుల నడతకు సంబంధించినది" అని అరవిందాశ్రమానికి చెందిన శ్రీ ఎ. బి. పురాని పేర్కొన్నారు. మనుష్యుల ప్రవర్తనను తీర్చిదిద్దేప్రయత్నం నేడు అత్యంత అవసరం. "యువభారతి" ప్రారంభించడంలో ఉద్దేశ్యమిదే!

# ప్రాణంకంటె దేశం ముఖ్యం!

—"స్వాతిశ్రీ"

1896లో ఇటలీదేశం ఆఫ్రికాలోని అబిసీనియా దేశంపై అన్యాయంగా దండయాత్ర జరిపింది. అబిసీనియా ప్రజలు వీరావేశంతో స్వాతంత్ర్యరక్షణకై పోరాడారు. ఆ యుద్ధంలో సంఘటన యిది.

ఇటాలియన్ సైనికులు ఒక గ్రామాన్ని ముట్టడించారు. అక్కడే అబిసీనియా సైనికులు దండిమగళ్ళయి సమరం చేశారు. కాని శత్రువుల సంఖ్యాబలం మితిమీరడంవల్ల అబిసీనియనులు తిరోగమింప వలసివచ్చింది. పారిపోతూ వారు ఒక కొండ బాటదాకా వెళ్ళి ఆగారు. ఆ బాటచివర ఒకగ్రామం. ఆ గ్రామానికి ఒకవంక ఏకాంతంగా ఒక అబిసీనియను సరదారుయొక్క యిల్లువున్నది. ఆయింటిలోని జనమంతా మాతృభూమి పిలుపువిని యుద్ధంలోకి వెళ్ళిపోయారు. ఒక కన్య మాత్రమే మిగిలివున్నది.

అబిసీనియా సైనికదళం సరదారు ఆలోచించాడు. వెన్నంటివస్తున్న ఇటాలియన్ సైన్యానికి ఈమె ఏ విధంగానైనా తమజాడ తెలుపదుగదా? అని ముందుకు వెళ్ళకుండానే ఆమెతో పరిచయంచేసుకొన్నాడు. శత్రువులకు తమజాడచెప్పడంవల్లదేశానికి పెద్దకీడు కలుగుతుందని చెప్పాడు. సరదారు

చెప్పడంమాత్రం చెప్పాడు. ఆమె సమాధానాన్ని కూడా ప్రతీక్షించకుండా సైన్యంతో గాలిలో తేలిపోయాడు.

రెండవ రోజున ఇటలీసైనికులు ఆ యింటిని చుట్టుముట్టారు. ఆ అమ్మాయిని అబిసీనియాసైనికులెక్కడ దాగివున్నారో తెలుపమన్నారు. వాళ్ళు కనిపించక మండిపడుతున్నారు. వాళ్ళు ఆమెకు ధనాశచూపారు; భయపెట్టారు. ఆమె ఏమీ చెప్పకపోయేసరికి అత్యాచారం చేయడంసాగించారు.

దీనంతటివల్లా తన మనస్సేమైనా సంకోచిస్తుందేమోనని ఆమె వెంటనే ఒక కత్తితీసుకొని చూస్తూచూస్తూ ఉండగానే తననాలుక కోసివేసి వాళ్ళముందు విసరివేసింది!

ఇటాలియనులు స్తబ్ధులైపోయారు. కోపంతో ఆమెను బాదిబాది సగంచంపి వెళ్ళిపోయారు. రెండవరోజున ఆమె శవంపడివున్నది. ప్రాణంకంటె దేశంముఖ్యమని నిరూపించింది ఆమె!

---

* "ధనమునకు ఎవ్వడు దాసుడుకాడో, ధనమెవరికి దాస్యముచేయునో వాడే నిజమైన మానవుడు"

—శ్రీ రామకృష్ణ పరమహంస

* మున్నేరోజుల్లో దేశంమీదికిపోయి కోతలరోజుల్లో కొడవలిపట్టుకువచ్చాడట! —తెలుగు సామెత
(శ్రమపడేటప్పుడు తప్పుకొని, ఫలం అనుభవించడానికి రావడం)




## పొడుగుగీత గీస్తేసరి!

—స్వామిరామతీర్థ

చీకటితో పోట్లాడడంవలన చీకటి పోదు. చీకటిగదిలోకి రాళ్లు విసరి, తలుపులు, బల్లలు, కుర్చీలు విరుగగొట్టి, సీసా బుడ్లు, చెంబులు కూలద్రోసి ఎంతసేపు యుద్ధంచేసినా ఆచీకటి పోతుందా? దీపం తీసుకొనిరండి; చీకటిఉండదు.

అందుచేత వ్యతిరేకవిమర్శలవల్ల, నిరుత్సాహపరచడంవల్ల, విషయాలు చక్కబడవు. అనుకూలవంతములైన, ఉత్సాహదాయకములైన, ఆశాప్రదములైన, ఉత్తేజకర విధానములే కార్యసాధనాలు. మురుగుడుగుంటలోని బురదంతాతీసి వీధుల్లో చల్లితే లాభమేముంది? ఏలాభమూఉండదు. అదేవిధంగా ఇతరులతప్పులను విమర్శించడంవల్ల మంచి జరుగదు. ఆ మురికిమీద ప్రశాంత నిర్మల జలాలను ప్రవహింపజేయండి. మురికంతా కొట్టుకుపోతుంది.

అక్బరు ఒకగీతగీసి, దానిని ఎటూతాకకుండా చిన్నది చేయమని మేధావియైన బీర్బల్‌ను అడిగాడు. బీర్బల్ అక్బరు గీసినగీతకుక్రింద, సమానాంతరంగా అంతకంటె పొడవైనగీటు గీసి, అక్బరుగీతను చెరపకుండానే చిన్నదిచేశాడు! జ్ఞానమంటే

క్షణ. అంతకంటె పొడుగుగీత గీయడమే జ్ఞానం. బీర్బల్ ఏ విధంగా అక్బరును ఆ గీత చిన్నదని ఒప్పించాడో అదే విధంగా నీవు ఏమి తెలియచేయదలచావో దానిని ప్రజలకు అనుభూతమయ్యేలాగు చేయడమే ఉత్తమ విమర్శ.

వాదప్రతివాదాలు, తర్కాలు ఎప్పుడూ నిష్ఫలమౌతై. వాదాలతో భేదాలు పోగొట్ట ప్రయత్నించడంవలన అసంతృప్తి, విరోధమూ పెరగడం తథ్యం. కట్టడం ప్రారంభించడానికి ముందు పునాది సరిగావుండాలి. మొదట హృదయాన్ని జయించు; తర్వాత హేతువుతో మనస్సును ఒప్పించు. వాదం గెలువనిచోట ప్రేమ విజయం పొందగలదు!

* * *

**ఎందరో మహానీయులు**

## చిత్తరంజనదాస్

ఇది రమారమి 60 ఏళ్ళ క్రిందటి సంగతి. కలకత్తాలో చిన్నసందులో ఒక ఉపాధ్యాయుడు నివసిస్తున్నాడు. పేదరికంలో మగ్గుతూ సంసారం వెళ్ళబోస్తున్నాడు. అప్పులవాళ్ళ బాధ ఎక్కువయింది. ఒకనాడు కోర్టుఅమీనా ఆ ఉపాధ్యాయుని ఇల్లు జప్తు చేయడానికివచ్చి పెట్టెలూ మంచాలూ వీధిలో పడవేయించి ఇల్లు అప్పులవాళ్ళకు స్వాధీనంచేస్తున్నాడు. ఆ ఉపాధ్యాయుని భార్యాబిడ్డలు శోకాలుపెడుతున్నారు.

ఆ త్రోవన వస్తున్న చిత్తరంజనదాస్ ఈదృశ్యం చూచాడు. ఆ ఉపాధ్యాయునివద్దనే చిన్నతనంలో తాను విద్యనభ్యసించాడు! చిత్తరంజనునిమనస్సు ఖేదపడింది. వెంటనే అమీనావద్దకువెళ్ళి "సామాను బయటవేయవద్దు. మేష్టరుగారిని ఇంట్లో వుండనివ్వండి. ఆయన ఎంతబాకీయో చెప్పండి. ఇదిగో నేను చెల్లిస్తున్నాను" అని చెక్కు రాసి అప్పటికప్పుడు డబ్బుచెల్లించాడు; ఇబ్బందుల్లోవున్న తన గురువును ఆదుకున్నాడు.

న్యాయవాదవృత్తిలో నెలకు వేలకొలది రూపాయలు ఆర్జించిన చిత్తరంజనదాస్ ఎందరో పేదవిద్యార్థులకు జీతం కట్టి చదివించాడు. ఆయన 1870 నవంబరు 5వ తేదీన జన్మించాడు. ఇంగ్లండులో బారిస్టరుపట్టం తీసుకొని కలకత్తావచ్చి న్యాయవాదిగా ప్రవేశించాడు. ఆయనభార్య శ్రీయుక్తవసంతీదేవి ఆయనకు సర్వవిధాలా చేయూతనిచ్చేది.

1919 లో జలియన్ వాలాబాగ్‌లో ఆంగ్లేయులు జరిపిన దారుణ హింసాకాండకు మిక్కిలి వ్యధచెంది, ఆంగ్ల ప్రభుత్వాన్ని తుదముట్టించాలనే దృఢసంకల్పంతో చిత్తరంజనదాస్ నెలకు 50 వేల రూపాయల రాబడిగల తన న్యాయవాదవృత్తిని త్యజించి జాతీయ ఉద్యమంలో ప్రవేశించాడు. 1920 లో జరిగిన నాగపూర్ కాంగ్రెసు మహాసభలో తన ఈ నిర్ణయాన్ని ప్రకటించాడు.

సుభాస్‌చంద్రబోస్ చిత్తరంజనుని ఆత్మీయుడైన అనుచరుడుగా పేరొందాడు. ప్రజలు "దేశబంధు" అనుపేరుతో చిత్తరంజనుని స్వీకరించేవారు,

ఆయనజీవితంలో మరొక చక్కని సంఘటనవున్నది. ఆయనతండ్రి దివాలాతీసి 50 ఏళ్ళక్రిందట చనిపోయినాడు. చిత్తరంజనుడు న్యాయవాదిగా ధనంగడిస్తున్న రోజుల్లో హైకోర్టుకువెళ్ళి 10 లక్షల రూపాయలుకట్టి, తన తండ్రియొక్క ఋణదాతలకు లేదా వారి వారసులకు ఆ డబ్బుచెల్లించి, తన తండ్రి దివాలాతీశాడనే మాటరద్దు చేయవలసినదిగా కోర్టు వారిని ప్రార్థించాడు!

"తండ్రిమరణించిన 50 ఏండ్లకు తండ్రిచేసిన ఋణాలను కొడుకుచెల్లించడం అనేది ఇప్పుడేచూస్తున్నాను" అని విస్మయంతో అభినందించాడా న్యాయమూర్తి!

దేశబంధు సి.ఆర్. దాస్ కుమార్తె ఇపుడు కలకత్తాలో వున్నది. ఆమెపేరు శ్రీమతి కళ్యాణిదేవి.

—o—

* భూమిలోవున్నట్లే సముద్రంలోగూడ అపారమైన ఖనిజ సంపద నిక్షిప్తమైవున్నది. ఒకఘనపుమైలు సముద్రపు నీటిలో 11 కోట్ల 70లక్షల టన్నుల ఉప్పు, 8 వేల టన్నుల అల్యూమినియం, 60 లక్షల టన్నుల మెగ్నీషియం, 2 లక్షల 83 వేల టన్నుల బ్రోమైను, 192 టన్నుల అయొడిన్, 440 పౌండ్ల బంగారమువుంటాయి. సముద్రంపులోన్నంత బంగారం భూమిలోగూడ లేదట!

## మనమాతృభూమి

# వరంగల్

—శ్రీ పి. వి. ప్రసాదరావు

1885లో లండన్‌లో ఒక వస్త్రప్రదర్శన జరిగినది. అందు వరంగల్‌లో తయారైన తివాసీలకు మొదటిబహుమతి లభించినదట!

13వ శతాబ్దంలో మార్కో-పోలో అను ఇటలీదేశీయుడు ఓరుగల్లు సందర్శించి ఇలా వ్రాశాడు: "చీని-చీనాంబరములకు తుల్యమైన ఎంతో సన్నని, సున్నితమగువస్త్రముల నిచట నేస్తారు. సాలీడుపోగునందలి పొరగూడ ఇచట తయారగువస్త్రముల మృదుత్వమునకుతీసి కట్టవుతుంది. ఇట్టివస్త్రములను ధరించుటకై కుతూహాల పడకుండెడి మహారాజులుగాని, రాణులుగాని యెందును ఉండబోరు".

ఇట్టి ఓరుగల్లునగరం కాకతీయులరాజధానిగా వర్ధిల్లింది. రుద్రమదేవి, ప్రతాపరుద్రుడు మున్నగువారు పరిపాలించారు. ఆకాలమునాటికోట శిథిలమై ఇప్పటికీ నిలచివున్నది. ఈకోటలో మధ్యనున్న బ్రహ్మాండమైన శిల, దానిచుట్టూ నాలుగువైపులా నాలుగు సింహద్వారాలు, దానిలోపల వివిధ ఆలయాలు, స్వయంభూఆలయం, వుండెడివి. ఈ కోటచుట్టూ రెండుప్రాకారాలున్నవి. ఒకటిరాతిది, రెండవదిమట్టిది. రాతికోట నానుకొని

లోనైన అగుపిస్తున్నది. బురుజులు మొదలైనవి శిథిలమైపోయి క్రీ.శ. 1199లో గణపతిదేవచక్రవర్తిచే ప్రారంభింపబడి 1261లో ఆయన కుమార్తెయగు రుద్రమదేవిచే ఈకోట నిర్మాణము పూర్తిఅయినదని తెలుస్తున్నది.

కాకతీయరాజులలో నొకడైన కుమార రుద్రదేవుడు వరంగల్ లో నిర్మించిన వెయ్యిస్తంభాల మంటపాన్ని ఇప్పటికీ చూడవచ్చు. ఇది నక్షత్రాకారంలోఉండి, మూడు దేవాలయ ములను కలిగియున్నది. శివ, విష్ణు, సూర్య దేవాలయములవి. ఇందు ద్వారాలమీదను, స్తంభాలమీదను పైకప్పునను చెక్క బడిన లతాగుచ్ఛాలు, వివిధనాట్యభంగిమలలోనున్న స్త్రీ మూర్తులు అద్భుతోదాత్త శిల్పకళాసౌందర్య విలసితాలు.

ఏకవీరదేవాలయం వరంగల్లుకు నాలుగుమైళ్ళదూరం లోవున్నది. రాణీరుద్రమదేవి ఓరుగల్లునుండి రోజూ ఈ ఆల యానికివచ్చి పూజలుసల్పి వెళ్ళేదట.

హనుమకొండకు, వరంగల్లునకు నడుమగల భద్రితటాకం తీరాన భద్రకాళిఆలయం ఇప్పటికీ శిథిలంకాకుండా నిలచి వున్నది.

వరంగల్ నకు ఈశాన్యమున 30 మైళ్ళదూరములో రామప్ప సరస్సు, దేవాలయమువున్నవి. ఇందలి శివాలయము లోని శిల్పము అత్యద్భుతమైనది. ఈదేవాలయ శిఖరమునకు వాడబడిన ఇటుకరాళ్ళు నీటిలోవేసినచో తేలుతాయట !

కాజీపేట, హనుమకొండ, వరంగల్ నగరములు మూ డునుకలిసి ఒకే మహానగరముగా రూపొందుచున్నవి. ఇచట

ఇప్పుడు రీజినల్ ఇంజనీరింగుకాలేజి, కాకతీయ మెడికల్ కాలేజి, పోస్టుగ్రాడ్యుయేట్ సెంటర్, సంస్కృతకళాశాల, ఆయుర్వేద కళాశాలయున్నవి.



## మాటా మంతీ

### ఏది మంచి వృత్తి?

'కోటివిద్యలు కూటికొరకే' అనునట్లు మానవులు అనేక వృత్తులు చేసి జీవనోపాధి గడించుకుంటూ వుంటారు. గిరి కుహరములలో కొందరు, పల్లెలలో కొందరు, నగరాలలో మరి కొందరు నివసిస్తూఉన్నారు. వింధ్యపర్వతాలలో నివసించే భిల్ల యువతులు చందనపు కట్టెలను అమ్ముకొని జీవిస్తూవుండగా, నల్లమల కీకారణ్యాలలో నివసించే చెంచులు తేనెనమ్ముకొని జీవిస్తారు. సముద్రతీరంలోని జాలరులు చేపలను పట్టుకొని పొట్ట పోసుకుంటూ ఉండగా, హిమవత్పర్వతములలో నివసించే గూర్ఖాలు సైనికులుగాచేరి దేశరక్షణ చేస్తున్నారు. సహ్యాద్రి పర్వతములలోని మరాఠీలు పాడి పశువులను పెంచి జీవించు చుండగా, కోనసీమలోని రైతులు వివిధ ఫలవృక్షములను పెంచి వర్ధిల్లుతున్నారు. ఒకవైపున రాళ్ళను పగులగొట్టి కొందరు కూలివాండ్రు జీవించుచుండగా మరియొకవైపున తలలు పగుల గొట్టుకొని ఆలోచించుచు పరిపాలనాబాధ్యతను విరామము లేకుండ కలెక్టర్లు నిర్వహించుచున్నారు. శాస్త్రవేత్తలు పరిశ్ర

మల నిర్వహణ చేయుచుండగా న్యాయవేత్తలు ధర్మనిర్వహణ చేయుచున్నారు. వైద్యశాస్త్రజ్ఞులు వ్యాధి నివారణచేయుచుండగా, వ్యవసాయదారులు క్షామనివారణ చేయుచున్నారు.

ఈ వృత్తులలో ఏది ఉత్తమము, ఏది అధమము అని చర్చించుట అవివేకమైన సంగతి. సమాజ శ్రేయస్సునకై ఎల్లరు వివిధ వృత్తులను విజయవంతముగా నిర్వహించవలసియున్నది. ఇందొకటి హీనమని, మరియొకటి ఉన్నతమని భావించుట శ్రేయస్కరముకాదు. అందుకే 'తెలుగులెంక' శ్రీ తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు ఆణిముత్యమనదగిన ఈ క్రింది పద్యములో ఈ భావమును చక్కగా పేర్కొనినారు :

"కలమెత్తిన హలమెత్తిన
మలమెత్తినవాని నొక్కమైఁ జూడవలెన్
వలతియు నలతియు లేదిటఁ
బలువృత్తులు సాగినపుడె బ్రతుకులు సాగున్"

కలమెత్తి వ్రాయు ఉద్యోగియు, నాగలిఎత్తి భూమిని దున్ను వ్యవసాయదారుడును, అశుద్ధము నెత్తుచూ జీవించెడి పాకీమనిషియు ఒకేవిధముగ చూడబడాలి. ఇచట ఒకవృత్తికి ఆధిక్యము, మరొకవృత్తికి అల్పత్వము లేదు. వివిధ వృత్తులు పరస్పర సామరస్యముతో సాగినపుడే ప్రజలబ్రతుకులు నడచును—అని ఈ పద్యములోని భావము.

ఎంతచక్కని పద్యము! ఎంత ఉదాత్తమైన భావము!!

# చిన్నకదలనుండి పెద్దసందేశం-1

మర్కటము, గార్ధభము, సంగీతకచ్చేరి చేయాలనుకున్నాయి. వాటికి భల్లూకము పోటేలు తోడైనాయి.

నాలుగు జంతువులూ గొంతులువిప్పి పాటమొత్తేముందు నాలుగు సంగీతపరికరాలను తెచ్చుకున్నాయి.

తాంబూర ఒకరు, వయొలిన్ మరొకరు, తాళం ఇంకొకరు, డోలు మరొకరు మెడకుగట్టుకువచ్చాయి.

తీగలను కదుపుతే మోతలు మటుకు వస్తున్నాయి. డోలు కొడితే శబ్దంమటుకు వస్తున్నది. దానిలో రమ్యతలేదు. అందంలేదు.

ప్రపంచాన్ని తమ పాటకచ్చేరితో ఉర్రూతలూగింపదలచిన ఆ నాలుగు చతుష్పాదులకూ ఏమిచేయాలో తోచలేదు.

తాము కూర్చున్న స్థానాలు మారిస్తే సంగీతం దొర్లుకు వస్తుందనుకున్నాయి.

గాడిదపోయి కోతిస్థానంలో కూచున్నది; కోతివచ్చి పోటేలుస్థానంలో కూచున్నది; పోటేలువెళ్ళి ఎలుగుబంటుచోట కూచున్నది; ఎలుగుబంటుపోయి గాడిదస్థాన మాక్రమించింది.

మరల పరికరాలను కదపడ మారంభించాయి. అదేదో గోలగా తయారయింది. కర్ణకఠోరంగావున్నది పాటకచ్చేరి.

ఇలాకాదని జంతువులు మళ్ళీస్థానాలు మారాయి. గుం

త్రంగా కూర్చోకుండా చతురస్రమంగా కూర్చున్నాయి. మళ్ళీ అవే సాగాలు, అదే లభా.

ఇప్పుడొక కోకిలమ్మ ఆదారిన పోతూవుంటే దాన్ని రమ్మని పిలిచాయి. "కోకిలమ్మా! కోకిలమ్మా! మేము పాటకచ్చేరి చేద్దామనుకున్నాం. మావద్ద అన్ని పరికరాలూ వున్నాయి. మేము ఎవరము ఎటుతిరిగి కూర్చోవలెనో చెప్పు" అని అడిగాయి.

అందులకు కోకిలమ్మ చెప్పింది: "పాటకచ్చేరి చేయటానికి నైపుణ్యంకావాలి. శ్రావ్యమైన గొంతుకావాలి. ఎవరు ఎటుకూర్చోవాలి అనేదానిమీద సంగీతం ఆధారపడదు. కూర్చో నేచోట్లనుబట్టి పాటగాండ్రు తయారుకారు" అనిచెప్పి రివ్వున ఎగిరిపోయింది!

అలాగే సామర్థ్యం అనేది, నైపుణ్యం అనేది వ్యక్తిలో వుంటుంది. దాన్ని అతడు సాధనచేసి సంపాదించుకుంటాడు. కుర్చీలు, బల్లలు, ఫాన్లు మొదలైన బాహ్య ఉపకరణాలవల్ల సామర్థ్యం ఏర్పడదు. బాహ్యమైన ఆడంబరాలవలన పనులు సాధింపబడవు. అంతర్గత సామర్థ్యంవలన పనులు నెరవేరు తాయి.

ఈకథను 1810లో రష్యన్ రచయిత క్రిలోవ్ వ్రాసి తన చక్రవర్తికి పంపాడు. జంతువులనూ పక్షులనూ పాత్రలుగాచేసి కథలు వ్రాసి ఒక ఉదాత్తమైన సందేశాన్ని అందజేసే ప్రక్రియను ప్రపంచంలో చాలమంది రచయితలు అనుసరించారు.

అట్టివారిలో క్రిలోవ్ ఒకరు. అతడు 1768లో జన్మించి తనకాలంలో వున్నటువంటి అవినీతిపూరితమైన పరిపాలనను తీవ్రంగా విమర్శిస్తూ కథలు వ్రాశాడు.

---

## ఉపాధ్యాయ దినోత్సవము

ప్రతివ్యక్తి తనజీవితంలో అనేకవిధాల కొందరికి ఋణపడివుంటాడు. మందిచ్చి వ్యాధినయంజేసిన వైద్యునికి కృతజ్ఞుడై వుంటాడు; ఉద్యోగమిచ్చిన అధికారికి కృతజ్ఞుడై వుంటాడు; అవసరానికి డబ్బుసహాయంచేసిన స్నేహితునికి కృతజ్ఞుడై వుంటాడు.

వీరందరికంటె తనజన్మకుకారకులై తనను కని పెంచిన తల్లిదండ్రులకుఋణపడివుంటాడు. నిజమే. కాని మాసిడోనియా రాజగు అలెగ్జాండర్ ఒక ఉదాత్తమైనభావం వెలిబుచ్చాడు : "జన్మనిచ్చిన తల్లిదండ్రులకు ఋణపడ్డాను; బాగుగా జీవించడం ఎలాగో బోధించిన నా ఉపాధ్యాయునికి మరింత ఋణపడివున్నాను".

**"I am indebted to my parents for my living and to my teacher for living well"** — ***Alexander of Macedonia.***

ఏదోవిధంగా జీవించడం మన అభిమతంకాదు. జంతువులు, పక్షులు, క్రిమికీటకాలు ఏదోవిధంగా జీవిస్తూవున్నాయి. బాగుగా జీవించడం, జీవితానికి ఒక గమ్యస్థానం ఏర్పరచుకో

వడం, జీవితాన్ని అమూల్యమైనదిగా రూపొందించుకోవడం మనకోరిక. అందులకై తోడ్పడేవాడే ఉపాధ్యాయుడు అట్టి మార్గదర్శనచేసేవాడే ఉపాధ్యాయుడు !

లోకమాన్య బాలగంగాధర తిలక్ జీవితంలో, సమాజంలో ఉపాధ్యాయుని స్థానాన్ని విశదపరచే సంఘటన ఒకటి వున్నది. అది 1919వ సంవత్సరం. మొదటిప్రపంచయుద్ధం సమాప్తమైనది. యుద్ధంలో ఇంగ్లండు గెలిచింది. యుద్ధానంతరం భారతదేశానికి బ్రిటిష్‌సామ్రాజ్యంలో అంతర్భాగంగా స్వయం పరిపాలన లభించగలదని పలువురు ఆశించారు.

ఒకమిత్రుడు తిలక్‌నుకలుసుకొని "మనకు స్వయంపరిపాలన లభించినట్లయితే, కేంద్రమంత్రివర్గంలో మీరు ఏపోర్టుఫోలియో నిర్వహించదలుస్తారు?" అని అడిగాడు.

అందుకు లోకమాన్యుడు నవ్వుతూ "స్వరాజ్యమేగనుక లభిస్తే నేనుమరల పూనాలో మేముస్థాపించిన హైస్కూలులో గణితశాస్త్ర ఉపాధ్యాయుడుగాచేరి పనిచేస్తాను" అని అన్నాడు.

ఆమిత్రుడు తెల్లబోయి "స్వాతంత్ర్యోద్యమాన్ని నిర్వహిస్తున్న మీరు స్వరాజ్యంవచ్చిన పిదప మంత్రిపదవిని చేబట్టరా?" అని మరలఅడిగాడు.

అందులకు తిలక్‌మహాశయుడు : "పరిపాలనాదక్షులైన వారు పరిపాలకులుగావుంటారు. అంతకంటె ముఖ్యమైనపని విద్యాలయాల్లో జరుగవలసివున్నది. సరియగు పరిపాలకులను

తయారుచేసేపని, రాబోవు యుపతరాన్ని తీర్చిదిద్దేపని, పాఠశాలల్లో జరగాలి. అందుకే నాకు ఉపాధ్యాయవృత్తిమీద ఇష్టం" అని అన్నారు.

డాక్టర్ రాధాకృష్ణన్ జన్మదినమైన సెప్టెంబరు 5వ తేదీన యావద్భారతంలో ఉపాధ్యాయదినోత్సవం జరుగుతూ వున్నది. ఆసందర్భంగా ఉపాధ్యాయవృత్తియొక్క ప్రాముఖ్యాన్ని అర్థంచేసుకొని గురువులను గౌరవించడంకొరకు యత్నిద్దాం.



# మాటా మంతీ

## జాతియొక్క బలం ఎందులో వున్నది?

ఒక జాతియొక్క బలం దేనిమీద ఆధారపడివుంటుంది?

ఆదేశంలో వున్నగనులు నదులు అడవులు మొదలైన ప్రకృతిసంపదమీద ఆజాతిగొప్పదనం అధారపడుతుందా? ఆ దేశపు పార్లమెంటువారుచేసే చట్టాలయొక్క ప్రాశస్త్యంమీద ఆధారపడుతుందా? ప్రభుత్వంవారు అనుసరించే ఆర్థిక విధానాలమీద ఆధారపడుతుందా? ఆదేశానికిగల యుద్ధనౌకలు విమానాలు జలాంతర్గాములు టాంకులు మొదలైన మారణాయుధాలమీద ఆధారపడుతుందా?

ఒకదేశం గొప్పధశకు పోవాలంటే ఇవన్నీ అవసరమే కాని వీటన్నిటికంటే ప్రధానమైన మరియొక విషయమున్నది.

ఏమిటనే? ఎనిమిదవతరగతి ఆంగ్ల పాఠ్యగ్రంథంలో పేర్కొన బడిన **"A Nation's Strength"** అను పద్యభాగంలో అతి ముఖ్యమైన విషయాన్ని సరళమైన భాషలో ఎమర్సన్ అనుకవి ఇలావర్ణించాడు :

**"Not gold, but only men, can make**
**A people great and strong—**
**Men who for truth and honour's sake**
**Stand fast and suffer long."**

పై పద్యంలోని మొదటిరెండు పాదాలలో స్వచ్ఛమైన మణిప్రాసవంటి సత్యాన్ని కవిపేర్కొన్నాడు. ఒకజాతిని గొప్పది గాను బలమైనదిగానుచేసేది మనుష్యులు మాత్రమేగాని బంగారంకాదు.

ఎటువంటి మనుష్యులవల్ల జాతికి ఉచ్ఛదశ సంప్రాప్తి స్తుందో తర్వాత రెండుపాదాలలోపేర్కొన్నాడు. సత్యంకొరకు, (జాతియొక్క) గౌరవంకొరకు నిశ్చలంగా నిలబడి సుదీర్ఘమైన కష్టాలను ఎదుర్కొగల మనుష్యులు జాతికి అవసరమని కవి వివరించాడు. వారినిగూర్చి ఇంకా ఇలా వ్రాశాడు :

**"Brave men who work while others sleep,**
**Who dare while others fly—**
**They build a nation's pillar deep**
**And lift them to the sky".**

మిగతావారు (నిర్లక్ష్యంతో) నిద్రిస్తూవుండగా ఈ వ్యక్తులు ధైర్యముతో కార్యభారముచు నిర్వహిస్తూవుంటారు;

మిగిలినవారు పరీక్షల నెదుర్కొనలేక పారిపోతూవుండగా ఈ వ్యక్తులు సాహసంతో ముందడుగు వేస్తారు.

అలాంటి వ్యక్తులే జాతియొక్క ప్రసాదములను నిర్మిస్తారు. వారే జాతియొక్క ఘనతను ఆకాశానికి ఎత్తగలుగుతారు!

అత్యంత అమూల్యమైన సత్యాన్ని ఆంగ్లకవి ఈరెండు పద్యాలలో వివరించాడు. ఇందలి ప్రతిపదముయొక్క అర్థాన్ని ఆస్వాదించి దీనిని మరల మరల చదవడం ఎంతైనా అవసరం. ముఖ్యంగా ఇందలి మొదటిరెండు పాదాలను ప్రతిదినము గుర్తు చేసుకోవడం ఎంతైనా ప్రయోజనకరం.

**Not gold but only men can make**
**A people great and strong—"!**

***

* "హృదయమే ఉత్తమబోధకుడు; కాలమే ఉత్తమ గురువు; ప్రపంచమే ఉత్తమ గ్రంథము; భగవంతుడే ఉత్తమ స్నేహితుడు" —టాల్మడ్

* "ఒక గొప్పవాని గొప్పతనం ఎందులో కనిపిస్తుందంటే, అతడు తక్కువవారితో వ్యవహరించేతీరును బట్టి తెలుస్తుంది." —కార్లయిల్

**(A great man shows his greatness by the way he treats little men.)**

ఎందరో మహనీయులు

# డాక్టర్ చంద్రశేఖర వెంకటరామన్

—శ్రీ వి. సత్యమూర్తి

ఒక శాస్త్రపరిశోధనాసంస్థలో ఉద్యోగంకోసం ఒక యువకుడువచ్చాడు. ఇంటర్వ్యూలో అతడు నెగ్గలేదు. నిబంధనల ననుసరించి ప్రయాణపుఖర్చులు పుచ్చుకొని ఇంటికి వెళ్ళమన్నారు.

కొంతసేపటికి ఆసంస్థ ప్రధానాధికారి వరండాలో వెళుతూ ఇంకా అక్కడే తారట్లాడుతున్న ఆయువకుని చూచాడు. "వెళ్ళిపొమ్మంటే ఇంకా ఇక్కడే వున్నావేం?" అని తీవ్రంగా ప్రశ్నించాడు.

"వెళతానండి. కాని మీ ఆఫీసువారు పొరబాటున అధికంగా యిచ్చినసొమ్మును వాపసుచేద్దామని మరలవచ్చాను" అన్నాడతడు. ఆ అధికారి అతని జవాబుకూ, అతని నిజాయితీకీ ముగ్ధుడైనాడు. "లోపలికిరాఅబ్బాయ్, ఆ ఉద్యోగం నీకే ఇస్తాను. ఫిజిక్సులో నీకున్నపరిజ్ఞానం తక్కువైనా ఫరవాలేదు. నీకు కావలసింది నేర్పుతాను. ఇలాంటి సౌశీల్యంగలవ్యక్తులే నాకు కావాలి" అన్నాడాయన. ఒక యువకునిలోని సుగుణాన్ని గుర్తించి అతనిని ఆదరించిన ఆ మహావ్యక్తిపేరు డాక్టర్ సి. వి. రామన్.

డాక్టర్ రామన్ 1888 నవంబరు 7న తమిళనాడులో తిరుచునాపల్లి దగ్గర అయ్యాన్ పెట్టైలో జన్మించాడు. ఆయన తండ్రి శ్రీ చంద్రశేఖర అయ్యర్ విశాఖపట్నంలో మిసెస్ ఎ.వి. యన్. కళాశాలలో ఫిజిక్స్ ప్రొఫెసరుగా పనిచేశారు. ఆయన తల్లి శ్రీమతి పార్వతీఅమ్మాళ్ సంస్కృతపండితుల వంశానికి చెందినది.

రామన్‌కు మొదటినుంచి పదార్థ విజ్ఞానశాస్త్రము మీద ఆసక్తి ఎక్కువ. కాంతి, వేడి, శబ్దాలనుగూర్చి లోతుపాతులు తెలుసుకోవాలనే తపనతో పది సంవత్సరాల వయసు లోనే—అవును, పదేసంవత్సరాలు — బి. ఏ. విద్యార్థుల దగ్గర నుండి పుస్తకాలను అరువు తెచ్చుకొని చదువుకొనేవాడు. 12 సంవత్సరాలు నిండకముందే అతడు మెట్రిక్యులేషను పరీక్షలో సర్వప్రథముడుగా ఉత్తీర్ణుడైనాడు. మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజీలో ఫిజిక్సు ప్రధానపాఠ్యభాగంగా బి.ఏ. చదివి విశ్వవిద్యాలయంలో ప్రప్రథముడుగావచ్చాడు. ఆయన మద్రాసులో ఎం.ఏ. చదువుతూ విద్యార్థిగావుంటూనే లండన్ నుంచి వెలువడే "ది ఫిలసాఫికల్ మ్యాగజైన్" మరియు "ది నేచర్" (The Nature) అను విజ్ఞానశాస్త్ర పత్రికలలో వ్యాసాలు వ్రాశాడు. అప్పుడాతని వయస్సు 18 సంవత్సరాలు!

కొంతకాలం అతడు డిప్యూటీ ఎకౌంటెంట్ జనరల్‌గా కలకత్తా, రంగూన్, నాగపూర్‌లలో పనిచేశాడు. కాని తన శాస్త్రపరిశోధనాన్వేషణను ఆపుకోలేక ప్రభుత్వోద్యోగానికి రాజీనామాఇచ్చి కలకత్తా విశ్వవిద్యాలయంలో ఫిజిక్స్ ప్రొఫెసర్‌గా

చేరాడు. అప్పటినుండి శాస్త్రవేత్తగా ఆయనజీవితం మహోజ్వలంగా ప్రకాశించింది.

"నా మతం సైన్సే, జీవితాంతంవరకు దానినే ఆరాధిస్తాను" అన్నాడు శ్రీ రామన్ ఒకసారి. దీనిలో అతిశయోక్తి యేమీలేదు. 60సంవత్సరాలపాటు విజ్ఞానశాస్త్రాన్నే తనమతంగా స్వీకరించి ప్రకృతియొక్క అంతర్గత లోతుపాతులను అన్వేషించడానికై ఆయన తన జీవితాన్ని అంకితం చేశాడు.

1928లో ఆయన "రామన్ ఎఫెక్ట్" అనబడే కాంతికిరణాలనుగూర్చిన పరిశోధనలో విజయం సాధించాడు. ఏపదార్థంపైనైనా కాంతి పడినపుడు ఆకాంతిలోని ఒక స్వల్పభాగం కొంతశక్తిని పోగొట్టుకుంటుందని ఆయన తన ప్రయోగాల ద్వారా నిరూపించాడు. ముఖ్యంగా ఆల్కహాల్ మీద కాంతి కిరణాలు ప్రసరించినప్పుడు వాటి ప్రభావాన్నిగూర్చి ఆయన పరిశోధించాడు. దీన్నే "రామన్ ఎఫెక్ట్" అంటారు. ఇది అణువుల పరిశోధనకు ఎంతో ఉపయోగించింది. ఇందుకోసం ఆయన "రామన్ స్పెక్ట్రోస్కోప్" అనే పరికరాన్ని రూపొందించాడు. "రామన్ ఎఫెక్ట్" కనిపెట్టినందుకు ఆయనకు 1930లో నోబెల్ బహుమతి లభించింది.

శ్రీ రామన్ తనకు లభించిన బహుమతిధనంతో బెంగుళూరులో ఒక పరిశోధనాసంస్థను నెలకొల్పాడు. షుమారు 100 మంది భారతీయ శాస్త్రవేత్తలు ఆయనవద్ద శిక్షణపొందారు. ముఖ్యంగా ప్రొఫెసర్ యస్. భగవంతం, డా॥ హోమీభాభా, డా॥ విక్రమ్ సారాభాయ్‌లు ఆయన శిష్యులే.

వ్యక్తిగా శ్రీ రామన్ నిరాడంబరుడు, నిగర్వి. సంభాషణలో చతురుడు. నోబెల్ బహుమతిని స్వీకరించడానికి స్టాక్ హోమ్ వెళ్ళినపుడు బహుమతి ప్రదానం జరిగిన తరువాత ఆయన తన "రామన్ ఎఫెక్ట్"ను వివరించాడు. తదుపరి, అభిమానులు ఆయనను మద్యం త్రాగడానికి ఆహ్వానించగా ఆయన నిరాకరించారు. అదిచూసి ఒకశాస్త్రవేత్త "ఇది న్యాయం కాదు, ఆల్కహాల్‌పై రామన్ ఎఫెక్ట్ ఎలా వుంటుందో ఇపుడు తెలుసుకున్నాము. మరి, రామన్‌పై ఆల్కహాల్ ఎఫెక్ట్ ఎలావుంటుందో తెలుసుకొనేఅవకాశం ఇవ్వరా?" అని చమత్కరించాడు. "థాంక్స్" అంటూ మద్యంతో నిండిన గ్లాసును మర్యాదగా అవతలపెట్టాడు శ్రీ రామన్ !

***



## కష్టాలువస్తే దేశంగుర్తుకొస్తున్నది

ఆలోచించలేని పసిపాపకు ఆకలయినపుడు మాత్రమే తల్లి గుర్తువస్తుంది. కడుపునిండగానే అమ్మను మరచిపోతుంది. ఇదేరీతిలో ప్రవర్తించుతూ కష్టాలు వచ్చినపుడు మాత్రమే దేశాన్నీ జాతినీ గుర్తుకుతెచ్చుకోవడం ఉత్తమదేశభక్తుని లక్షణం కాదు.

ఆపదలో నున్నపుడు అందరూ దేవునిగుర్తుకు తెచ్చుకుంటారు. మనిషికి జబ్బుచేస్తే, తనకు నయంకాగానే సత్యనారాయణవ్రతం చేసుకుంటానని మొక్కుకుంటాడు. ఆ వ్రతసమయంలోచెప్పే కథప్రకారం "సత్య"మంటే ఏమిటి? "ఆపదలు, కష్టాలు వచ్చినపుడు మనకు అవగతమయేది సత్యం" అని చెప్పబడింది. భక్తకబీరు మరొక అడుగు ముందుకుపోయి "సుఖంగాను ఆనందంగాను వున్నపుడుగూడ భగవంతుని గుర్తుచేసుకుంటే మనకు కష్టాలేవుండవు" అని చెప్పాడు. జాతియొక్క జీవితం విషయంలో గూడ ఇంతే.

బీహారురాష్ట్రంలో ప్రచండమైన క్షామంఏర్పడినపుడు హిమాలయాలనుండి కన్యాకుమారివరకు ఒకే దేశమని, దేశప్రజలు యావన్మందీ తమను క్షామంనుండి రక్షించాలనీ బీహార్ ప్రజలుఅన్నారు. కాని ఆ తరువాత ఆరాష్ట్రంలో అధికంగా పంటలుపండితే ధాన్యం యావత్తూ తమకే వుండాలన్నారు.

పాకిస్తానుతో యుద్ధాన్ని ఎదుర్కొన్నపుడు పంజాబీలు జాతినీ దేశాన్నీ గుర్తుచేసుకున్నారు. కాని వారిని కేరళకు గోధుమలు పంపండి అనికోరితే "మేము ఇతరరాష్ట్రాలకు ఆహారధాన్యాలు పంపి మారాష్ట్రంలో ఖరీదులు ఎందుకుపెరగనివ్వాలి? కేరళవాళ్ళను అమెరికానుండి తెప్పించుకోమనండి" అన్నారు.

ఒక బెంగుళూరు నివాసికి బొంబాయిలో వున్నపుడు మాత్రమే జాతిగుర్తుకువస్తుంది. బెంగుళూరు పోగానే మరచిపోతాడు, ఒక ఉత్తరభారత వ్యాపారస్థుడు మద్రాసులో

వ్యాపారంచేస్తున్నప్పుడు దేశాన్ని గురించి మాట్లాడుతాడు. కాని ఉత్తరప్రదేశ్‌కు వెళ్ళగానే దేశం అనేది అతని మనోఫలకము నుండి తొలగిపోతుంది. ఒక తమిళుడు ఢిల్లీలోవుండగా భారత మాతను గుర్తుచేసుకుంటాడు. మద్రాసుకు మరలివెళ్ళగానే మద్రాసీగా భావించుకుంటాడు. ఇదీ నేటిదుస్థితి.

కాని పూర్వకాలంనుండిగూడా జాతీయభావనను మనకు పదేపదే గుర్తుచేసే ఆచారాలున్నాయి. ఏదైనా శుభకార్యం చేసేటప్పుడు, అనుదినం సంకల్పం చెప్పుకుంటూ, "జంబూ ద్వీపేభరతవర్షే, భరతఖండే" అని చెప్పి ఆఖరుకు తనకుటుంబం పేరు, తనపేరుచెపుతారు ఈనాడు అన్నీ తారుమారవుతు న్నాయి. వ్యక్తియే ముందువస్తున్నాడు. దేశమూ ప్రజలూ మరుగున పడిపోతున్నారు. మనమంతా ఒకేజాతికిచెందిన వార మనే సత్యం గుర్తుచేసుకున్నట్లయితే మనకు ఏసమస్యగూడా భారమనిపించదు.

—ఒక దేశభక్తుడు

---

* మందుకుపోయి మాసికానికి వచ్చాడట!

—తెలుగుసామెత

(రోగికి మందు తెమ్మని మనిషిని పంపితే, రోగిచచ్చిన తరువాత నెలరోజులకు మాసికంసమయానికి వచ్చాడు. ఆలస్యాన్ని గురించి చెప్పేటపుడు ఈసామెత వాడు తారు.)

# ఇచ్చినతేదీ ఏ వారము?

—శ్రీ వి. సత్యమూర్తి

దీన్ని లెక్కించడానికి సోమవారం 1, మంగళవారం 2, బుధవారం 3, గురువారం 4, శుక్రవారం 5, శనివారం 6, ఆదివారం 7, లేక 0 తో సూచింప బడతాయి.

ఇవ్వబడిన తేదీగల సంవత్సరానికీ, ప్రస్తుత సంవత్సరానికీ గల వ్యత్యాసానికి, ఆ రెండుసంవత్సరాల మధ్య సంభవించే లీపుసంవత్సరాల సంఖ్యను కలపండి. దానిని 7చే భాగించి శేషాన్ని గుర్తించండి. ఇచ్చిన తేదీకి ఈ సంవత్సరంలో అయితే ఏ వారం అవుతుందో చూచి దానికి సంబంధించిన అంకెకు పై శేషాన్ని (రాబోయే సంవత్సరాల విషయంలో) కలపండి; గతించిన సంవత్సరాల విషయంలో తీసివేయండి. ఫలితం 1 అయితే సోమవారం, 2 అయితే మంగళవారం........7 లేక 0 అయితే ఆదివారం. ఒక్కొక్కసారి ఫలితం ముందు తీసివేత గుర్తువస్తుంది. అప్పుడు దానికి 7 కలపండి. మరోసారి ఫలితం 7ను మించి రావచ్చు. దానిలోనుంచి 7 తీసివేయండి.

ఉదాహరణ : 1947 అగస్టు 15వ తేదీ ఏవారం?

1971–1947=24. మధ్య సంభవించే లీపుసంవత్సరాలు 6. కూడండి. 30 వస్తుంది. 7చే భాగించండి–శేషం 2. 1971లో ఆగస్టు 15 ఆదివారంనాడు వస్తుంది. ఆదివారానికి సంకేతం 0. దీనిలోనుండి పైనవచ్చిన శేషాన్ని తీసివేస్తే 0–2=–2,

(–) గుర్తు వచ్చింది కనుక 7 కలపండి. ఫలితం 5. అనగా, శుక్రవారం.

2001 ఆగస్టు 15వ తేదీ ఏవారం?

2001-1971=30. మధ్యన వచ్చే లీపు సంవత్సరాలు 8. కూడండి. 38 వస్తుంది. 7చే భాగించండి – శేషం 3. 1971లో ఆగస్టు 15 ఆదివారంనాడు వస్తుంది. ఆదివారానికి సంకేతం 0. దీనికి పై శేషాన్ని కలపండి. ఫలితం 3. అనగా ఆనాడు బుధవారం అన్నమాట.

గమనిక : 4 చేత నిశ్శేషంగా భాగించబడే ప్రతిసంవత్సరమూ లీపుసంవత్సరమని అంటాము. కాని శతాబ్దాంతాన వచ్చేసంవత్సరాలు (1800, 1900, 2000) 400 చేత నిశ్శేషంగా భాగింపబడితేతప్ప లీపుసంవత్సరము కాలేవు. అందువలన 1900 లీపుసంవత్సరం కాదు. 2000 లీపుసంవత్సరం.

---

* కాలమును బోలిన ఘనబోధకుడుండబోడు.

—పర్షియన్ సామెత

* "భావన రూపందాలిస్తే కళఅవుతుంది."

—శ్రీ ఎన్. సంజీవదేవ్

* దొంగకూ దొంగకూ పరిచయంలేకపోయినా స్నేహితులే.

—కన్నడసామెత

# మనమాతృభూమి

## హంపి విజయనగరము

దక్షిణ భారతదేశ చరిత్రలో 1336వ సంవత్సరము విశిష్టత కలిగియున్నది. ఢిల్లీసుల్తానుల బారినుండి దక్షిణాపథమును కాపాడుటకై విద్యారణ్యస్వామియొక్క మార్గదర్శకత్వమున సంగమవంశమునకు చెందిన హరిహరరాయలు, బుక్కరాయలు అను సోదరులు విజయనగర రాజ్యమునుస్థాపించారు. తుంగభద్రానదికి దక్షిణతీరమున విజయనగరకోటను నిర్మించారు. ఆంధ్రభోజుడుగా ప్రసిద్ధిచెందిన శ్రీకృష్ణదేవరాయలు శోభాయమానముగ పరిపాలించాడు. ఈ ఆంధ్రరాజ్యము తళ్లికోటయుద్ధానంతరము 1565లో పతనావస్థకు వచ్చినది. విదేశములనుండివచ్చిన అనేకమంది యాత్రికులు విజయనగర వైభవమును అనేకరీతులలోకొనియాడినారు. వెనిస్ నగరము నుండి వచ్చిన నికోలోకోంటీ అను నతడు విజయనగరములో జరుగు దసరా ఉత్సవమును వర్ణించియున్నాడు. పట్టణములో రత్నములు, వజ్రములు బహిరంగముగ విరివిగా అమ్మబడు చున్నవని పేర్కొనియున్నాడు. ఆనాటి విజయనగర సామ్రాజ్యములో అనేక రేవుపట్టణములు కలవనియు బర్మా, చైనా, ఈజిప్టు దేశములతో నౌకావ్యాపారము జరుగుచుండెడిదనియు 'అబ్దుల్ రజాక్' అనుపారసీక రాయబారి పేర్కొనినాడు.

ఇప్పుడు హంపీ శిథిలములను చూచుటకై గుంటూరు - హుబ్లి ప్యాసింజరులో బయలుదేరి హాస్పేటవద్ద దిగి బస్సులో హంపీ చేరవలెను. ఒకవైపు తుంగభద్రానది, మూడువైపుల ఋష్యమూక మాల్యవంత మాతంగపర్వతములచే పరివేష్టింపబడిన ఈ పురాతన రాజధాని ఎనిమిది చదరపుమైళ్ళ విస్తీర్ణము కలిగియున్నది.

ఇందు శ్రీకృష్ణదేవరాయలు నిర్మింపజేసిన విఠలాలయము ప్రత్యేకించి చూడదగినది. ఇందలి మంటపములోగల రాతిస్తంభములు బహుచిత్రమైనవి. ఒక్కొక్క స్తంభములో ఏడు చిన్న స్తంభములు తొలచబడినవి. వానిని మీటినచో సప్తస్వరములు వినగలము. ఇట్టి వింత దక్షిణాపథమున మరి యొకచోట కానరాదు. విఠలాలయములో ఒకేరాతిలో తొలచబడిన రథములున్నవి. ఆ రథములను అలంకరిస్తూ వేయబడిన రంగులు ఇప్పటికిని నశింపలేదు.

రాజులు దర్బారుతీర్చిన 'భువనవిజయ'మను ప్రదేశము నేలమట్టము చేయబడి దసరాదిబ్బ యనుపేరుతో ఇప్పుడు పిలువబడుచున్నది. దానికి చేరువగనే ఏనుగులశాల కలదు. మరి యొక వైపున పద్మాకారమున నిర్మింపబడిన మేడయున్నది. అందు రాణులు నివసించెడివారు. ఉగ్రనరసింహస్వామి విగ్రహము, హజారారామ దేవాలయము చూడదగినవి. ఆదేవాలయములో రామాయణగాథ యంతయు దేవాలయపు గోడల మీద చిత్రములుగా చెక్కబడినది. అట్లే శ్రీకృష్ణదేవరాయలు అనుదినము దర్శించెడి శ్రీకృష్ణదేవాలయము కూడ శిథిలమైయున్నది.

విజయనగరము నేలిన శ్రీకృష్ణదేవరాయలు తనరాజధానిలో మహమ్మదీయుల యుపయోగార్థము మసీదు నిర్మించాడు. ఆమసీదు ఇప్పటికిని నిలిచియున్నది. తుంగభద్రానదీతీరమున పూర్వము శ్రీరామచంద్రుఁడు ఋష్యమూకపర్వతముపై వానరులతో చెలిమిచేసినట్లు రామాయణమువలన తెలియగలదు. ఆ పర్వతే మిచటనేయున్నది. ఇప్పటికిని వందలకొలది మర్కటములకు అది నివాసము. తుంగభద్రానదిపై పురాతనమగు రాతివంతెన శిథిలమై కన్పట్టుచుండును. విద్యారణ్య మహర్షి అర్చనచేసెడి విరూపాక్షదేవాలయము ఇప్పటికిని చెక్కుచెదరక నిలిచియున్నది. అచట మహాశివరాత్రికి గొప్ప ఉత్సవము జరుగుచుండును. ఇట్టి చారిత్రక ప్రదేశములను జీవితమున ఒక్కసారియైనను దర్శించి మన ప్రాచీనచరిత్రనుండి ఉత్సాహము పొందుట మన ధర్మము.



* బాగా అప్పులో మునిగినవాడిని "ఏమయ్యా! ఇన్ని అప్పులుచేశావు గదా, రాత్రిళ్లు నిద్రపడుతున్నదా?" అని ఎవరో అడిగారు.

"నిద్రపట్టంది నాకుగాదు, అప్పులిచ్చిన వాళ్లకు" అని అతని జవాబు. —శ్రీ వి. సత్యమూర్తి

* "ఎముకలరిగేటట్లు పనిచేస్తే దంతములరిగేటట్లు తినవచ్చు. —మళయాళీ సామెత

# విరామ మెప్పుడు?

గడియారంగూర్చి చిన్న కథ ఒకటున్నది. బాలుడొకడు బంధువుల ఇంటికి వెళ్లాడు. అచట గోడగడియారం చూచాడు. అది టిక్కు-టిక్కు-మని శబ్దంచేస్తూ గంటలు నిముషాలు చూపుతూవుంటే బాలుడు ఆసక్తితో దానివంక చూస్తూనిలబడ్డాడు.

తరువాత అతడు తనపనిలో మునిగిపోయాడు. రాత్రి నిద్రపోబోయేముందు గడియారంవంక చూశాడు. అది ఎప్పటిలాగా పనిచేస్తూనేవున్నది. రోజల్లా, తాను చూచినప్పుడుడల్లా, గడియారం టిక్కు-టిక్కు మంటూనేవున్నది. బాలుడు నిద్రపోయి మరునాటిఉదయం గడియారంవంక చూచాడు. అప్పుడూ అది పనిచేస్తూనేవున్నది. తాను నిద్రపోయాడు; కాని గడియారం నిద్రపోలేదు. అతని కాశ్చర్యంవేసి "గడియారమా, నీకు విశ్రాంతి ఎప్పుడు?" అని ప్రశ్నించాడు.

"నాకు విశ్రాంతి ఒక 'టిక్కు'కూ మరొక 'టిక్కు'కూ నడుమ"అని అన్నది గడియారం!

నిజానికి విరామమెరుగనికృషికి గడియారం ఒక ప్రతీకం. ఒకవిధంగా మానవునికి సహితం విశ్రాంతిఉండదు. జీవించియున్నంతవరకు ఏదో ఒకపనిచేస్తూ ఉండవలసిందే. అందుకే పనిలేకపోవడంకాదు, 'పనియొక్క-మార్పే విశ్రాంతి' అని చెప్పబడినది.

కొంతకాలం క్రిందట ఒక విద్యావేత్త అమెరికా సంయుక్తరాష్ట్రములు పర్యటించివచ్చాడు. తానచట చూచిన విష

యాలు కొన్నిటిని చేస్తూంటూ, అమెరికాలో మనుష్యులు సోమరితన మెరుగరని. ఆదేశంలో ఏపనీ చేయలేనివృద్ధులు సహితం ఇంట్లోకూర్చుని వంటపాత్రలనైనా కడుగుతారేగాని ఊరక కాలం వెళ్ళబుచ్చరని అన్నాడు.

మనదేశంలో ఏపని చేయకపోవడం అదృష్టంగా పరిగణించబడుతున్నది. "అతనికేమండీ, కాలుమీదకాలు వేసుకొని కూర్చోగలడు"అని అంటూవుండడం తరచు వింటూంటాం. వ్యక్తియొక్కగాని దేశంయొక్కగాని అభ్యున్నతికి ఏపనీచేయకపోవడమనే మన స్తత్వం చాల అపకారం కలిగిస్తుంది.

అత్యధికమైనకాలం చేతులకు పనికలిగించడంద్వారా సంపద వృద్ధిచెందుతుంది. రెండవప్రపంచ యుద్ధానంతరం జర్మనీ దేశస్థులు తమ ఆర్థిక వ్యవస్థ పునర్నిర్మించుకోవడంకోసం దినమునకు 14 గంటలవరకు పనిచేశారని తెలుస్తున్నది. కాని మన దేశంలో శలవులసంఖ్య పెరిగి పోతున్నది. పనిచేసే రోజుల్లో పనిమీద నిర్లక్ష్యం పెరిగిపోతున్నది, నిష్క్రియత్వం, సుగుణముగా చెలామణి అవుతున్నది. ఇది శ్రేయస్కరంకాదు.

సోమరితనమే మానవుని ప్రథమ శత్రువని గ్రహించవలసిన అవసరం ఎంతైనా వున్నది!

---

* "పట్టుచీర ఎరువిచ్చినమ్మ పీటపుచ్చుకు తిరిగిందట"

—తెలుగు సామెత.

* రొట్టెకు రేవేమిటి? —తెలుగు సామెత

(రొట్టెతినడానికి ఫలానావైపునుండి తినవలెనను నియమం ఏమీలేదు)




# ఆత్మ స్తుతి పనికిరాదు

విద్య కామధేనువువలె కాలముకాని కాలమందును ఫల మొసంగును; పరిచయములేని పరదేశమందును తల్లివలె పోషించును; నిల్వచేసిన ధనమువలె సమయమునకు సహాయమొనర్చును.

ఇంద్రుడైనను తనను తాను స్తోత్రము చేసుకొనినచో గడ్డిపరక కంటెను తేలికయగును.

ఏడంతస్తుల రత్నసౌధమైనను, బిడ్డలు తిరుగనిది గృహమని చెప్పుకోతగదు. బంధువులు లేనివారికి తూర్పుపడమరలు తెలియవు.

ఒకపనియందును నిలకడలేని చపలచిత్తుడు జనసంకుల ప్రదేశమందున్నను, నిర్జనమగు మహారణ్యమందున్నను సుఖపడ జాలడు.

విద్యార్థియగువాడు కామమును జయింపవలెను; నాల్కతీపి మరువవలెను; తనకొక అక్షరముపదేశించినను అట్టివానిని దేవతాసమునిగా గౌరవించవలెను,

హింసింపబూనినవానిని హింసించుటలో దోషమేమా త్రమును లేదు.

మానవుడు సింహమువలన గొప్ప పనినైనను సులభముగా సాధించుట నేర్చుకొనవలెను. కొంగవలన ఇంద్రియములను నిగ్రహించి దేశకాలములను గుర్తెరింగి కార్యమును సాధించుట గ్రహించవలెను. శున్నియకక సంగరమొనర్చుట, తాను ఆర్జించిన పదార్థములనే అనుభవించుట కోడివలన గ్రహించవలెను.

—మహామంత్రి చాణక్యుడు

—o—

ప్రముఖన్యాయవాది భాష్యం అయ్యంగార్ మద్రాసు హైకోర్టులో వాదిస్తుండగా, ఆంగ్లేయుడగు న్యాయమూర్తి "వాదించడమనవసరం. ఒక చెవిలోనుంచి వింటూవుంటే రెండో చెవినుండి బయటికి పోతున్నాయి" అన్నాడు.

అందుకు భాష్యం అయ్యంగార్ సమాధానం: "ఆ రెండు చెవులమధ్య ఏమైనావుంటేగదా నిలవటానికి!"

* * *

కుక్కకరవడానికివస్తుంటే అడిదముసూరకవి పరుగెత్తి స్నేహితులగుంపులో చేరాడు.

వారిలో ఒకడు "అలా గాడిదలా పరుగెత్తుతావెందుకు" అన్నాడు.

"మందలో కలవడానికి" అన్నాడుసూరకవి!

—"మంగళకృష్ణ"

# డాక్టరు హరగోవింద్ ఖొరానా

పిల్లలకు రంగులో, ఆకారములో, స్వభావములో పెద్దల పోలికలు కొన్ని సంక్రమించుచనను విషయము అందరకు తెలిసినదే. బిడ్డలకు తల్లిదండ్రుల పోలికలు కొన్ని ఉన్నను భేదములు లేకపోవు. ఈ పోలికలు, భేదములు ఎట్లుకలుగునో తెలియజేయు శాస్త్రము 'వంశానుగత స్వభావ శాస్త్రము, (Genetics). ఈ శాస్త్రములో అద్భుతమైన పరిశోధనలు సాగించి వైద్యరంగములో మహోన్నత కృషి సలిపినందుకు 1968 సంవత్సరంలో మన భారతీయుడైన డా॥ హరగోవింద్ ఖొరానాకు నోబెల్ బహుమతి లభించినది.

డా॥ ఖొరానా రాయపూర్ లో 1922 జనవరి 9వ తేదీన జన్మించారు. తన 21వ యేట పంజాబ్ విశ్వవిద్యాలయం నుండి రసాయన శాస్త్రంలో పట్టభద్రులైనారు. 23వ సంవత్సరంలో ఎం. ఎస్ సి., డిగ్రీని తీసుకున్నారు. ఆతరువాత లివర్ పూల్ విశ్వవిద్యాలయం నుండి పి. హెచ్. డి. పట్టంపొందారు. 1950 నుంచి 1952 వరకు కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయములో న్యూఫెల్డ్ పరిశోధకునిగా పనిచేసి, 1952 నుంచి 1960 వరకు వాంకూవర్ లోని బ్రిటిష్ కొలంబియా విశ్వవిద్యాలయంలో పరిశోధనాచార్యునిగా, రసాయనశాస్త్ర విభాగమునకు అధిపతిగా పనిచేశారు.

తరువాత ఆయన అమెరికాలోని విస్కాన్సిన్ విశ్వవిద్యాలయంలో ఎంజైముపరిశోధనావిభాగంలో చేరి, క్రమంగా ఆ సంస్థలో డైరెక్టరు అయినారు. 1966లో అమెరికా పౌరసత్వాన్ని స్వీకరించి అచటనే స్థిరపడ్డారు.

నిశితమైన పరిశోధన, అసాధారణ ధీశక్తి, నిరాడంబర వ్యక్తిత్వము గల డా॥ ఖొరానా ఎన్నో బహుమతులను పొందగలగడంలో ఆశ్చర్యపడవలసిన అవసరం వుండదు. 1969లో భారత రాష్ట్రపతి వీరికి 'పద్మవిభూషణ్' బిరుదును బహూకరించారు.

ప్రస్తుతము అమెరికా పౌరుడైనప్పటికి జన్మతః భారతీయుడైన డా॥ ఖొరానా సాధించిన అత్యున్నతవిజయం మన కందరకు గర్వకారణము. ఆయన నిపరుమాన కృషి, అచంచల కార్యదీక్ష నేటి విద్యార్థి లోకానికి ఆదర్శప్రాయములు.

భారతీయులలో రవీంద్రనాథటాగూర్ సాహిత్యరంగంలోను, డా॥ సి.వి. రామన్ భౌతికశాస్త్రరంగంలోను, 'నోబెల్' బహుమతిని అందుకొనగా ఇప్పుడు డా॥ ఖొరానా విజ్ఞానశాస్త్రరంగంలో మహోన్నతమైన కృషిసలిపి పై వారి స్థాయికి చేరుకొన్నారు. వారి ఆదర్శప్రాయమైన జీవితం మనదేశములోని యువతరానికొక ఆశాదీపిక.

* * *

* బుద్ధిహీనుడైతేనేగాని ఒకేగోతిలో రెండుసార్లు పడ్డడు!

— (టర్కీ సామెత)

# ప రా మ ర్శ

ఒక చెవిటివాడు తన బంధువుకు సుస్తీచేసి ఆస్పత్రిలో ఉన్నాడని తెలిసి పరామర్శించడానికి బయలుదేరాడు. వెళ్ళగానే ఏఏ ప్రశ్నలడగాలో ఇలా ముందుగానే ఆలోచించుకున్నాడు :

"మొదట 'జబ్బు ఎలావుంది?' అని అడుగుతాను. 'కొంచెం తగ్గింది' అని జవాబిస్తాడు. 'ఇంకా బాగానే అవుతుందిలే' అని అంటాను. కాసేపాగి మళ్లీ 'మందు ఎవరిస్తున్నారు?' అని అడుగుతాను. ఎవరిస్తారు? ఏ డాక్టరుగారి పేరో చెపుతాడు. 'అవును, అతనే తగ్గవాడు—అతని దగ్గరనే తీసుకో' అంటాను. మూడవప్రశ్నగా 'ఏంమందు తీసుకుంటున్నావు?' అంటాను. ఏదోపేరు చెపుతాడు. 'అవును అదేతీసుకో' అనిచెప్పి మిగతా వాళ్ళతో గూడ వస్తానని చెప్పి వచ్చేస్తాను" అని అనుకుంటూ వెళ్ళాడు.

ఆసుపత్రికిచేరి బంధువుదగ్గరకు వెళ్ళాడు. అనుకున్నట్లుగానే 'జబ్బు ఎలావుంది?' అని అడిగాడు. రోగి 'చచ్చేస్థితిలో వుంది' అన్నాడు. 'అవును ఇంకా బాగానే అవుతుందిలే' అన్నాడతను. రోగి ఆశ్చర్యపోయాడు.

రెండవప్రశ్న వేశాడు : 'మందు ఎవరిస్తున్నారు' అని. రోగికొంచెం కోపంగా 'ఎవరేమిటయ్యా బ్రహ్మదేవుడు'

అన్నాడు. 'అప్పుడు అతడే దగ్గరవాడు - అతనిదగ్గరనే తీసుకో' మన్నాడతను!

వెంటనే మూడో ప్రశ్న వేశాడు, 'ఏంమందు తీసుకుంటు న్నావు?' అని. రోగికి కోపం ఎక్కువైంది. 'ఏం మందా? మన్నా మశానం' అన్నాడు. 'అదే తీసుకో. వెళ్ళివస్తా!' అంటూ వెళ్ళిపోయాడు!

—'గిరీశ్', సికిందరాబాద్

---

ఆరోగ్యవిశేషాలు :

# ధూ మ పా న ము

పొగాకు అనేది కొలంబస్ అమెరికాను కనుగొన్నతరు వాత ఆఖండమునుండి మిగిలిన ఖండాలకు వ్యాప్తిచెందింది.

ఒక్క సిగరెట్‌లో షుమారు 100 మిల్లిగ్రాముల నికో టిన్ వుంటుంది. 500 మిల్లీగ్రాముల నికోటిన్ ను మానవశరీర ములోనికి ఎక్కించినట్లయితే అతడు వెంటనే మరణిస్తాడు.

రోజుకు రెండు పెట్టెల సిగరెట్లు కాల్చువాని శరీరంలో సంవత్సరానికి 72 మిల్లిగ్రాముల పాషాణం చేరుకొంటుంది. ఇది గాక క్షణములో చంపగల **Colline, Prussic acid** అను విష

ములున్నాయి. అందుగల మిథైల్ ఆల్కహాల్ గ్రుడ్డితనమును కలిగిస్తుంది.

ధూమపానంవలన రోగగ్రస్తులై మరణించేవారి సంఖ్య ఆశ్చర్యం కలిగిస్తుంది. వియత్నాం యుద్ధంలో 1968లో మరణించిన అమెరికన్ సైనికుల సంఖ్య 14,521. అదే సంవత్సరంలో మోటారుప్రమాదాలకు గురిరై మరణించిన అమెరికన్ పౌరులసంఖ్య 55,500. అదే సంవత్సరంలో సిగరెట్లుకాల్చడం వల్ల వ్యాధిగ్రస్థులై మరణించిన అమెరికన్ ప్రజలు 3,00,000 (మూడు లక్షల) మంది. ఆదేశంలో ధూమపానం కారణంగా రోజుకు 800 మంది మరణిస్తున్నారు.

పొగత్రాగడం మూలమున వచ్చేడివ్యాధులు ఇవి : 1. ఊపిరితిత్తులకు, నోటికి, గొంతుకు, లీవరుకు సంభవించు క్యాన్సరువ్యాధి. 2. ఊపిరితిత్తులందలి దీర్ఘకాలిక నెమ్ము. 3. హృద్రోగములు.

పొగత్రాగని వానికంటె రోజుకు రెండుపెట్టెల సిగరెట్లు కాల్చువారికి ఊపిరితిత్తుల క్యాన్సరువ్యాధి వచ్చుటకు 20 రెట్లు అధిక అవకాశమున్నది; సిగరెట్లు కాల్చనివారికంటె 50% అధికముగా సిగరెట్లు కాల్చువారికి హృద్రోగములు సంభవిస్తున్నాయి.

ఇక డబ్బుఖర్చుగురించి: రోజుకు రెండు సిగరెట్టుపెట్టెలు కాల్చువారు చాలామందివున్నారు. రెండుపెట్టెల ఖరీదు రు. 1-20. ఇలా సంవత్సరానికి ఖర్చు 438రు. ఒకడు 15వ ఏట

సిగరెట్టుకాల్చుట ప్రారంభించి 75వ సంవత్సరంవరకు కాల్చి నట్లయితే దానికగు వ్యయము రు 26,289 లు. అతడు సిగరెట్ కాల్చుట మానివేసి ఏటా రు 438 లను 9% చక్రవడ్డీచొప్పున బ్యాంకులోవేస్తే 75వ ఏడు నిండుసరికి అతనికి రు 8,48,746లు లభిస్తాయి!

ధూమపానముచేయువారిని హెచ్చరిస్తూ **Dr. Harold S. Diehl** అను ప్రముఖవైద్యుడు ఇలా అన్నాడు : "రోజుకు రెండుసిగరెట్లు, అంతకుమించికాల్చువారు 8.3 సంవత్సరముల జీవితకాలము నష్టపోతారు. కాల్చిన ప్రతిసిగరెట్టువలన 6 నిము షముల జీవితకాలం తగ్గిపోతుంది."

పాశ్చాత్యదేశాలలో పొగత్రాగడం మానివేయవలసి నదిగా ఆరోగ్యశాఖవారు ప్రజలను అనేకవిధాల కోరుచున్నారు.

—**శ్రీ వై. సూర్యనారాయణ, బి. ఎ., బి. ఇడి., రేవేంద్రపాడు**

---

* "తేలికయైన పదార్థములను, పనికిమాలిన పొట్టునువదలి వేసి ఘనమై ఉపయోగపడు పదార్థములను చేట తనలో నిలుపుకొనును. ఉత్తములైనవారి స్వభావము లిట్లుం డును". —శ్రీరామకృష్ణ పరమహంస

* రాలిపోయినపూలు తిరిగి కొమ్మలకు అతుకోవు!

(జపాను సామెత)

(ఆత్మీయులలో విరోధంవస్తే తిరిగికలవడం కష్టం)

# మాటా మంతీ

## పా ద భ్ర మ క ము

ఆంధ్రసాహిత్య చరిత్రలో శ్రీకృష్ణదేవరాయల పరిపాలనాకాలము స్వర్ణయుగము వంటిది. ఆసమయంలో దిగ్గంతులవంటి మహాకవులు రాజాస్థానాన్ని అలంకరించారు. మనుచరిత్ర, వసుచరిత్రవంటి మహాకావ్యాలు వెలువరచారు.

ఆనాటికవులు శబ్దాలతో ఆటలాడారు. ఆంధ్రసంస్కృత భాషలు వారిచేతులలో నాట్యామాడాయి. ఒకేపద్యంలో రెండర్థాలు వచ్చేటట్లు శ్లేషకవిత్వం వ్రాశారు. అంతేగాక చిత్రకవిత్వంగూడ వెలువరచారు.

చిత్రకవిత్వమంటే చిత్రమైన కవిత్వం. ఈక్రింది పద్యాన్ని నందితిమ్మన్న కవీంద్రుడు పారిజాతాపహరణంలో రచించాడు. ఈ పద్యాన్ని "పాదభ్రమకము" అంటారు. ఇందలి నాలుగు పాదాలలో ప్రతిపాదాన్నీ ముందునుండి చివరకు చదివినా, తుదినుండి మొదటికి చదివినా ఒకేరీతిలో వుంటుంది:

ధీర శయనీయ శరధీ
మార విభా నుమత మమత మను భావిరమా
సారసవన నవసరసా
ధారద సమ తారహార తామస దరధా!

ఇలారచించడం ఎంతో కష్టం. పద్యంలో గణములు, యతి ప్రాసలు సరిపోతూ రమణీయమైన అర్థాన్నికూడ ఇస్తున్నదీ పద్యం. ఇందు కవి విష్ణుమూర్తిని ప్రార్థిస్తున్నాడు. దీని అర్థం ఇలావున్నది:

ధీర = ధీరుడవైన; శయసీయ శరధీ = సముద్రమునే పక్కగాగలవాడా; మారవిభా=మన్మధుని తేజస్సునందు; అనుమత=అనుమతింపబడిన,మమతా=ప్రేమగలవాడా;మను=మంత్రములచేత; భావి=భావింపదగు; రమా=లక్ష్మిగలవాడా; సారసవన=పద్మమే యిల్లుగాగల లక్ష్మి దేవికి; నవసరసా=ప్రియమైన సరసుడా, దారదసమ=పాదరసముతో సమానమైన; తారహార = ముత్యములహారముగలవాడా; తామస = దుష్టులకు; దర=సిగ్గును, దా=ఇచ్చువాడా.

ఆశ్చర్యకరము, ఆసక్తిదాయకమైన ఇట్టి కవిత్వరీతులను వెలయించిన పూర్వకవుల ప్రతిభ మనకు గర్వదాయకము గదా!

---

* గాలిని గురించి క్షుణ్ణంగా తెలుసుకోవాలని కృషిచేసిన వాడు స్వీడన్ దేశస్థుడైన కారల్ విల్ హెల్మ్ సీక్లే. గాలిమీద ప్రయోగాలు చేస్తూ సీక్లే ఒక క్రొత్త రకం గాలిని కనిపెట్టాడు. దానిని పీలిస్తే మొదట మత్తెక్కిపోతుంది. ఆ తరువాత నవ్వువస్తుంది. అందుచేత ఈ వాయువును **Laughing gas** అని అంటారు. దీనిని **Nitrous Oxide** అంటారు. దీనిని ఆపరేషన్ సమయంలో క్లోరోఫారంబదులుగా వాడవచ్చు.

# అంతర్జాతీయ విద్యా సంవత్సరం

"ప్రపంచం అతివేగంగా మారుతూవున్నది. ప్రపంచంతో పాటు విజ్ఞానంకూడ అత్యంతవేగంతో పురోగతి పొందుతున్నది. ప్రతి పదిసంవత్సరాలకు మానవ విజ్ఞానం రెట్టింపు అవుతూవున్నది. మరొకవిధంగా చెప్పాలంటే 10 సంవత్సరాల వ్యవధిలో విజ్ఞానశాస్త్రవేత్తలు కనిపెడుతున్న సాంకేతిక పరిజ్ఞానం గత అనేకశతాబ్దాలలో కనిపెట్టబడిన యావత్తు విజ్ఞానానికి సరితూగుతుంది" అని యూనివర్సిటీ గ్రాంట్సుకమిషను అధ్యక్షుడు డాక్టర్ డి. యస్. కొఠారి పేర్కొన్నారు.

ఈవిధంగా, సర్వతోముఖంగా పెంపొందుతున్న విజ్ఞానాన్ని ఆర్జించి జీవితాన్ని ప్రకాశవంతం చేసుకొనడానికి యావత్ప్రపంచంలోను బాలబాలికలు ప్రయత్నిస్తున్నారు. 1960 నుండి 1965లోపల ప్రపంచంలో విద్యార్థుల సంఖ్య నూటికి 61 వంతులు పెరిగింది. 1947లో భారతదేశంలో 19 యూనివర్సిటీలుండగా ఈనాడు 70 యూనివర్సిటీలువున్నాయి. ఆనాడు 2½ లక్షలమంది కాలేజీవిద్యార్థు లుండగా ఇప్పుడు 25 లక్షలమంది కాలేజీలలో చదువుతున్నారు. హైస్కూలు తరగతులలో 1947లో 10 లక్షలమంది విద్యార్థులుండగా ఇప్పుడు 70 లక్షల మంది విద్యార్జనచేస్తున్నారు. స్వాతంత్ర్యం రాకపూర్వం నూటికి 14 మంది అక్షరాస్యులు దేశంలో వుండగా ఇప్పుడు వారిసంఖ్య నూటికి 30 వరకు పెరిగింది.

విద్యయెడల ఇంతటి ఆసక్తి దేశప్రజలకు కలగడం ఎంతైనా ఆనందదాయకము. జీవితమనే మహాసముద్రంలో

ప్రయాణించడానికి ఉపకరించే తెరచాప విద్య. జీవితాన్ని రణ రంగంతో పోలిస్తే విద్యను కవచంగా భావించవచ్చు. జీవితం కటిక చీకటిలో ప్రయాణం వంటిదైతే విద్య ప్రకాశవంతమైన బ్యాటరీలైటువంటిది. విద్య దాచిపెట్టబడిన ధనమువంటిదని, పర దేశంలో సహాయము అదుకొనే స్నేహితుని వంటిదని మనకవులు వర్ణించారు.

విద్యఅనేది కేవలం ఒక సాంకేతిక నైపుణ్యామో, ఆర్థిక శాస్త్రపరిజ్ఞానమో, వైద్య విజ్ఞానమో మాత్రమేకాక అర్ధి సంపూర్ణ మానవుని రూపొందించగలగాలి. జీవనోపాధికొరకు కొన్ని సాంకేతిక విషయాలను నేర్చుకుంటూనే విద్యార్థి వాటితోపాటు తోటిమానవులతో ఎలామెలగాలో గ్రహిం చాలి. ఇదే సరియైన విద్యకు లక్షణం.

యావత్ప్రపంచంలో 1970 సంవత్సరాన్ని అంతర్జాతీయ విద్యాసంవత్సరంగా పరిగణించారు. ఈయేడాదిలో ప్రత్యేక మైన కృషిద్వారా క్రమక్రమ ప్రజలకు విజ్ఞాన వికాసాలను కలి గించాలని వివిధదేశాలలో ప్రయత్నం జరుగుతూవున్నది.

కేవలం విద్యాలయంలోనే విద్యాభ్యాసం ప్రారంభం కాదు. అది ఇంటివద్ద తల్లియొక్క ఒడిలో కూర్చున్నపుడే ప్రారంభమవుతుంది. తల్లికూడ ఒక విధంగా ఉపాధ్యాయుని వంటిదే. ఒక ఆంగ్ల రచయిత ఇలా వ్రాశాడు : "విద్య అనేది అక్షరాభ్యాసంతోనే ప్రారంభంకాదు. అది తల్లియొక్క మధుర వీక్షణాలతో, తండ్రియొక్క ఆమోదముద్రతో, చెల్లెలి మెత్తని

చేసైగలతో, సోదరుని అభిమాన వాక్కులతో ప్రారంభమవు తుంది."

ఆదరణతో గూడిన గృహం చక్కని విద్యాలయం వంటిది.

***




# ఆంధ్రకేసరి ప్రకాశం

అది 1953వ సంవత్సరం. అక్టోబరు 1వ తేదీన కర్నూలు రాజధానిగా ప్రత్యేకాంధ్రరాష్ట్రం నిర్మాణం కాబోతున్నది. శ్రీ టంగుటూరిప్రకాశంపంతులుగారు ముఖ్యమంత్రిగా మంత్రి వర్గం ఏర్పడబోతున్నది.

ఒక జ్యోతిష్కుడు వారివద్దకు వచ్చి "అక్టోబరు 1వ తేదీ మీకు మంచిరోజుకాదు. ఆనాడు మీరుపదవీ స్వీకారం చెయ్యకండి. ఒకరోజుముందుగాని ఒకరోజు తర్వాతగాని పదవీ స్వీకారం చేయండి." అని సూచించాడు.

అందుకు ప్రకాశంగారు "బాగుండనిది నాకా, ఆంధ్ర రాష్ట్రానికా" అనిఅడిగారు. బాగుండనిది మీకేనని జ్యోతిష్కుడన్నాడు.

"నాకు బాగుండకపోయినా ఫరవాలేదు. రాష్ట్రానికీ ప్రజలకూ బాగుండేచాలు. ఈపదవిని అంటిపెట్టుకొని కూచో బోవడంలేదు" అని జేబులోనుంచి ఒక కాగితం తీసిచూపించారు. అది పదవికి రాజీనామాపత్రం!

ప్రకాశంగారు ప్రజలకోసమే వున్నారుగాని పదవులకోసం లేరు. అందుకే వారు పదవులను వదలుకోవలసి వచ్చింది గూడాను. 1946లో మద్రాసు రాష్ట్రముఖ్యమంత్రిగాను, 1953లో ఆంధ్రరాష్ట్రముఖ్యమంత్రిగాను వారు పదమూడేసి నెలలు మాత్రమే వున్నారు.

ఏదైనా ప్రమాదంవస్తే దానికి దూరంగా వెళ్ళిపోవడం మానవుని ప్రవృత్తి. కాని ప్రమాదంతో చెలగాటమాడడం ప్రకాశంగారికి సరదా. ప్రమాదం వున్నచోటల్లా ప్రకాశం ప్రత్యక్షమౌతాడని డాక్టర్ పట్టాభి అన్నారు.

1937లో మద్రాసురాష్ట్రంలో శ్రీ సి. రాజగోపాలాచారి ముఖ్యమంత్రిగా, శ్రీ ప్రకాశం రెవిన్యూశాఖామంత్రిగా తొలికాంగ్రెసు మంత్రివర్గ మేర్పడింది. జమీందారీలు రద్దు చేయవలసిన అవసరాన్నిగూర్చి ఆయన విశిష్టమైన రిపోర్టు తయారుచేశారు. దాన్ని శాసనసభలో ప్రవేశపెడుతూ అనర్గళమైన ఉపన్యాసమిచ్చారు. ఆ ఉపన్యాసం వినడానికి వేలాది ప్రజలు శాసనసభాభవనంవద్దకు వచ్చారు. శాసనసభలో ప్రేక్షకుల గ్యాలరీలో కూర్చోడానికి ఏ వందమందికో అవకాశం వుంటుంది. మరి మిగతావాళ్లు ఆ ఉపన్యాసం వినడం ఎట్లా? ఆ రోజుల్లో శాసనసభ స్పీకరు శ్రీబులుసు సాంబమూర్తిగారు

గూడ స్వతంత్రంగా ఆలోచించగల సాహసికులు. వెంటనే లౌడ్ స్పీకర్లు తెప్పించి శాసనసభ వెలుపల కట్టించారు. ప్రకాశంగారి ఉపన్యాసాన్ని యావన్మందీ వినగలిగారు. ఇలా లౌడ్ స్పీకర్లు వెలుపల కట్టే ఏర్పాటు ఏయితర శాసనసభ యొక్క చరిత్రలోనూ జరుగదు, జరుగలేదు.

ఇలాంటి సాహసముతో గూడిన పద్ధతి బులుసు సాంబమూర్తిగారు అవలంబించారంటే, ఆనాటి ప్రకాశంగారి ఉపన్యాసాన్ని ప్రజలు ఎంతగా అభిమానించారో ఊహించవచ్చు.

అది 1928వ సంవత్సరం. 1919 లో ప్రవేశపెట్టబడిన మాంటేగ్ చెమ్స్‌ఫర్డుసంస్కరణలు ఎంతవరకు పనిచేస్తున్నాయి, భవిష్యత్తులో భారత దేశానికి ఎలాంటి పరిపాలనావిధానం కావాలి, అనేవిషయం పరిశీలించడానికై బ్రిటిష్ ప్రభుత్వం సర్ జాన్ సైమన్ నాయకత్వాన ఒకకమిషన్‌ను నియమించింది. ఆ కమిషన్‌లో భారతీయులెవరూ లేనందున భారతప్రజలు "సైమన్ గోబ్యాక్" అనే నినాదం ద్వారా, నల్ల జెండాల ప్రదర్శనద్వారా అసమ్మతి తెలియజేశారు. ఈప్రదర్శనలకు బొంబాయిలో పంజాబ్ కేసరి లాలాలజపతిరాయ్ ఆధ్వర్యంవహించి లాటీదెబ్బలకు గురయి మరణించాడు. లజపతిరాయ్ మరణానికి కారకుడైన శాండర్స్‌అను ఆంగ్లేయుని ఆతరువాత కాల్చిచంపిన యువకవిప్లవవీరుడు సర్దార్ భగత్ సింగ్ భారతీయులకు చిరస్మరణీయుడు.

ఆ సైమన్ కమిషన్ మదరాసు వచ్చినపుడు హైకోర్టు సమీపంలో వేలాదిప్రజలు గుమిగూడి "సైమన్ వెళ్ళిపో" అని

నినాదాలు చేస్తున్నారు. శ్రీ ప్రకాశంగారు ఆప్రదర్శనలకు నాయకత్వం వహించారు. సైనికులువచ్చి ప్రజలను చెదరి పొమ్మని హెచ్చరికచేశారు. ఎవరూ కదలలేదు. సైనికులు జరిపిన కాల్పులకు పార్థసారధి అనే యువకుడు నేలకొరిగాడు. ప్రజలలో హాహాకారాలు చెలరేగాయి. ఆ మృతవీరుని దగ్గరకు పోవడానికి ఎవరికీ గుండెలు చాలలేదు. ముందుకువస్తే ప్రేల్చి వేస్తామని సిపాయిలు హెచ్చరిస్తున్నారు. ప్రజలకు ఏమిచేయ డానికి తోచక ఆగ్రహ ఆవేశాలతో సైనికులకు ఎదురుగా నిలిచివున్నారు.

అపుడు 56 సంవత్సరాల వయసుగల ప్రకాశంగారు సైని కుల తుపాకీలకు గుండెచూపుతూ మృతవీరునివైపు నిర్భయంగా నడుస్తున్నాడు. కాలు కదిపితే కాల్చివేస్తామని సైనికులు కేకలుపెడుతున్నారు. "ముందు నన్ను కాల్చి తరువాత నా ప్రజ లను కాల్చండి" అంటూ ప్రకాశంగారు చొక్కావిప్పి సైనిక లకు ఛాతీ చూపుతూ ఎదురు నడిచారు. సిపాయిలు నిశ్చేష్టులై నిలిచిపోయారు. ప్రజాసమూహం "ఆంధ్రకేసరి జిందాబాద్" అంటూ దిక్కులు పిక్కటిల్లేటట్లు గర్జనలుచేశారు.

చిన్నతనంలో ప్రకాశంపంతులు దుర్భరదారిద్ర్యాన్ని గడపవలసివచ్చింది. ఒంగోలులో ఆయనతల్లి హోటలుపెట్టి ఆయనను పెంచి పెద్దవాణ్ణిచేసింది. ఒకసారి పరీక్షఫీజు చెల్లించ డానికి మూడురూపాయలు లేకపోయినవి. తల్లి చాలాప్రయ త్నించింది. ఎక్కడా దొరకలేదు. వినోదరాయుడుపాలెంలో వున్న మేనమామ దగ్గరకుపోతే మూడురూపాయలు దొరుకు

తాయని రాత్రికిరాత్రే బయలుదేరి 15 మైళ్లు నడిచి అవూరు వెళితే అచట మేనమామ వూళ్ళోలేడు. హతాశుడై ప్రకాశం తిరిగి వచ్చాడు. మరునాడే ఫీజు కట్టాలి. ఎలామరి? తల్లికొక ఆలోచనతట్టింది. ఆమె తన పట్టుబట్టను తాకట్టుపెట్టి మూడు రూపాయలు తెచ్చి అతనికిచ్చింది!

కష్టాలలోనుండి, దారిద్ర్యంలోనుండి మహనీయులు వెలువడుతారని చెప్పడానికి ఆంధ్రకేసరి చక్కని ఉదాహరణ. శ్రీకృష్ణునికి గోపికలకూ ఎలాంటి సంబంధంవుండేదో ప్రకాశం గారికీ ప్రజలకూ అలాంటిసంబంధం వుండేది. 1872 ఆగస్టు 23 తేదీన జన్మించి 1957 మే 20వ తేదీన కన్నుమూసిన ప్రకాశం గారి శతజయంత్యుత్సవాలు రాష్ట్రమంతటా జరుగుచున్నాయి.

---

* పనిచేయనివాడు ఇంటిదొంగ; పన్నుకట్టనివాడు దివాణానికి దొంగ. —తెలుగు సామెత

(ఇంట్లోపనులు తప్పించుకొని తిరిగేవాడు కుటుంబానికి అపకారంచేసి దొంగఅవుతున్నాడు. ప్రభుత్వానికి పన్ను కట్టక తప్పించుకొనేవాడు దేశానికి అపకారంచేసి దొంగ అవుతున్నాడు.)

* "తేలికగల పదార్థములలో తృణమే తేలిక, దాని కన్నను దూది తేలిక, దానికన్నను యాచకుడు తేలిక." —ధాణుక్యుడు

# ముసలమ్మ కట్ట

ఇది రాయలసీమలోని అనంతపురం వద్దగల బుక్కరాయ సముద్రమను గ్రామానికి సంబంధించిన గాథ. రెండు వందలసంవత్సరాల క్రిందట జరిగిన విషయం.

ఆవూరినానుకొని విశాలమైన చెరువొకటివున్నది. విజయ నగరసామ్రాజ్యకాలంలో ఒకసారి మూడురోజులపాటు ఎడ తెగకుండా కుండపోతగా వర్షాలుకురిశాయి. గట్లుతెంచుకొని ఏరులు ప్రవహించాయి. చెరువు పూర్తిగా నిండిపోయింది. దానికొకచోట చిన్న గండికూడాపడింది. వర్షంమాత్రం తగ్గ కుండా ధారాపాతంగా కురుస్తూనేవున్నది.

ఆవూరిప్రజలు భయకంపితులైపోయారు. చెరువుకంటె పల్లంలోవున్నది వూరు. గండి పెద్దదవుతే ఊరుమునిగిపోవడం, అంతానాశనమవడం తథ్యం. గండి పూడ్చడానికి పలువురు శతవిధాలప్రయత్నిస్తున్నా సాధ్యమవడంలేదు.

ఆసమయంలో ఒకరికి పూనకంవచ్చి ఆగండిలోకి ఎవ రైనాదూకి ఆత్మబలిదానం చేసుకుంటే వర్షంతగ్గుతుందనీ గండి పూడుతుందనీ చెప్పారు. ఈసంగతి అందరికీ తెలిసింది. కాని ఎవరూ ముందుకురావడంలేదు.

అపుడు ఆగ్రామంలో పెద్దరెడ్డిగారి ఏడవకోడలు, ముస లమ్మ అనుపేరుగల పుణ్యస్త్రీ, దగ్గరవారందరికీ నమస్కరించి

వెళ్ళి అందులోదూకిందట. ఆవిడప వర్షం ఆగిపోయింది; తెగిన గట్టు పూడ్చడం సాధ్యమయింది. ముసలమ్మత్యాగంవల్ల గ్రామం రక్షించబడింది. ఇప్పటికీ ఆగట్టును "ముసలమ్మకట్ట" అనిపిలుస్తారు. ప్రతి ఏటా అక్కడ అమెజ్ఞాపకార్థం పూజలు చేస్తుంటారు.

మానవశ్రేయస్సుకోసం ప్రాణత్యాగంచేసిన మహనీయులు చిరస్మరణీయులు.

—"మంగళకృష్ణ"

***

* ఇరువురు వ్యక్తులు ఒకే మంచముమీద నిద్రించవచ్చు, కాని వేర్వేరు కలలుగంటారు. —చైనాసామెత
(ప్రపంచములో ఒకే వాతావరణములో నివసిస్తున్నప్పటికీ, ఏ ఇద్దరి జీవితములు ఒకేరీతిలోనుండవు. వైవిధ్యం ప్రకృతిలో తప్పదు)

* సత్యం చెప్పులుతొడుక్కునేలోగా అసత్యం భూప్రదక్షిణం చేసివస్తుంది. —ఒక ఆంగ్లకవి

* సింహానికి తోకగా ఉండటంకన్న కుక్కకుతలగా ఉండడం శ్రేష్ఠం. (ఆంగ్లసామెత)
**(Better be the head of a dog, than the tail of a lion)**

# జానపద కళలు

ఇప్పుడు దేశంలో సినిమాలు విపరీతమైన ప్రచారంలో ఉన్నాయి. పండితులు, పామరులుకూడ సినిమాలయొక్క మోజులోపడి గ్రామాలలో అనాదిగావస్తున్న జానపద కళలను నిర్లక్ష్యంచేస్తున్నారు. అవి ఉన్నాయనికూడ ప్రజలు మరచిపోతున్నారు. కొన్ని శతాబ్దాలుగా దేశప్రజలకు విజ్ఞానాన్ని, వినోదాన్ని, సాహిత్యాభిరుచిని కలిగించి కొంత వరకు ప్రజలలో నైతికవిలువలను నిలబెట్టడానికి అవి ఉపకరించాయి.

వీధినాటకములు, బుఱ్ఱకథలు, హరికథలు, యక్షగానములు, చోడిగాని కలాపము, పగటివేషములు, తోలుబొమ్మలాటలు, భజనకూటములు, గిరిజననృత్యములు, జానపదనృత్యములు – ఇవి మన గ్రామసీమలలో కొద్దిసంవత్సరాలక్రిందటి వరకు బహుళమైన ప్రచారంలో వుండేవి; మనదేశసంస్కృతిని, అభిరుచులను ప్రతిబింబించేవి. డబ్బులు పెట్టి టిక్కెట్టుకొనే వారికి మాత్రమే ఈనాటి సినిమాప్రదర్శనచూచే అవకాశం వుంది. కాని ఆనాడు గ్రామాలలో ఆబాలగోపాలము నిరుపేదల మొదలు జమీందార్ల వరకు వీధినాటకాలు చూచి ఆనందించేవారు. టిక్కెట్లతో పనిలేదు. ఇలాంటి జానపద కళలు ఎలా ఉద్భవించాయి? అందులో హాస్యం ఎలా తొణికిసలాడేది? పౌరాణిక, సాంఘిక ఇతివృత్తాలు ఏ విధంగా ప్రదర్శింపబడేవి? స్టేజి, మైకు, కర్టెను, లైటింగు లేకుండా ఏవిధంగా ప్రేక్షకులను ఆనందపరచగలిగారు? ఇట్టి ప్రాచీనమైన గ్రామీణ

కళలనుగూర్చి సవివరంగా తెలిపే చక్కని గ్రంథం ఆంధ్ర ప్రదేశ్ సంగీతనాటకఅకాడెమీవారు ప్రచురించిన 'నాట్య కళ' మార్చి 1970 సంచిక. ఈ సంచిక జానపద ప్రదర్శనలను గురించి తగిన వర్ణచిత్రాలతో, ప్రామాణికమైన 30 రచన లలో సర్వాంగసుందరంగా ఒప్పుచున్నది. సామాన్యులకు తెలి యని అనేక విషయాలిందు పేర్కొనబడ్డాయి.

పురాణాలలో చెప్పబడిన యక్షులు ఒకప్పుడు సింహళ దేశంలో వుండేవారు. నృత్యగానాలలో ప్రజ్ఞావంతులైన వారు సింహళంవదలి దక్షిణభారతంలోకి వలసవచ్చి "జక్కులు" అను పేరుతో పిలువబడ్డారు.యక్షగానములను ప్రదర్శించేవారు. ఆ ప్రదర్శనలే ఇప్పుడు భామాకలాపం, బుర్రకథ, హరి కథల రూపములు దాల్చినవి. వీరు గుంటూరు, కృష్ణా, గోదావరి జిల్లాలలో నివసిస్తున్నారు.

ఇప్పటి నాటకాలలోవలె అనేకపాత్రలు వీటిలోవుండవు. ఒకే నటుడు కథయావత్తు ప్రదర్శిస్తాడు. భామాకలాపంలో సత్యభామ తనమీద కృష్ణుడు అలిగి చక్కాబోయిన వృత్తాం తము తన చెలికత్తెతో ఇలా చెప్పింది:

"అపుడు స్వామివారు నన్ను తొడలపై కూర్చుండ బెట్టుకుని, అమూల్యమైనటువంటి ఆభరణములు అలంకరించి, నిలువుటద్దం తెచ్చి యెదుటవుంచి నీడలు చూచి, 'సత్యభామా! నీవే చక్కని దానవా, నేనే చక్కనివాడనా, అని అడిగేనే ఓశమ్మా! అడిగేసరికి ఆడబుద్ధి గనుక, అబలలముగనుక, తెలి యక 'నేనేచక్కనిదాన'నంటినే ఓశమ్మా! అంతట స్వామివారు

నామీద చాలా కోపంచేసి, దిగ్గునలేచి చక్కా పోయెనే కోశమ్మా! మరి నా మగవాడు ఎందుబోయెనో, ఎక్కడ బోయెనో, ఎవరికెరుకనే కోశమ్మా!"

ఒకప్పుడు బుఱ్ఱకథను జంగాలు చెప్పేవారు. ఒక పురుషుడు అతని ఇరుప్రక్క భార్యలు కలసి కథచెప్పేవారు. శ్రీనాథ కవి కాలంనుండీ బుఱ్ఱకథలున్నాయి. ఉత్తమమైన బుఱ్ఱకథ పల్నాటిచరిత్ర. ఇది ద్విపదలో రచింపబడింది. బొబ్బిలికథ, బాలనాగమ్మకథ ఉత్తరగోగ్రహణము పేరొందిన బుఱ్ఱకథలు. ఆధునికకాలంలో శ్రీ షేక్ నాజర్ సాటిలేని కథకుడుగా పేరొందాడు.

హరికథకూడా యక్షగాన ప్రక్రియయొక్క రూపాంతరము. విజయనగరానికి చెందిన ఆదిభట్ల నారాయణదాసుగారు దీనిని వ్యాప్తిలోనికి తీసుకువచ్చారు. స్వయంగా కథలు రచించారు. మొదట్లో విష్ణుకథలనే హరికథలుగా చెప్పేవారు. తరువాత శివకథలు, చారిత్రక పురుషుల గాథలుగూడ చెప్పుతున్నారు. నారాయణదాసుగారు రచించిన మొదటి హరికథ ధృవచరిత్ర. కథచెప్పుతూ మధ్యలో నీతిబోధకమైన పిట్టకథలు హాస్యధోరణిలో చెప్పి రంజింపజేస్తుంటారు.

జానపదకళలకు కూచిపూడివారు మూలపురుషులు. సిద్ధేంద్రయోగి కృష్ణాజిల్లాలోని కూచిపూడిలో నృత్యనాట్య సంగీతాలకు పునాదివేశాడు. 1687లో గోల్కొండ పాలించిన అబ్దుల్ హస్సన్ తానీషా కూచిపూడిగ్రామాన్ని కళాకారులకు అగ్రహారంగా దానం చేశాడు. కూచిపూడివారు దేశాటనం

చేస్తూ నాటకాలను ప్రదర్శించటం వృత్తిగా చేపట్టారు. వీరిలో వేదాంతంవారని, చింతావారని, భాగవతులవారని, హరివారని, ఇంగువవారని ఇంటిపేర్లు గల వారున్నారు. వీరు వీధి నాటకాలు, పగటివేషాలు, భామాకలాపాలు ప్రదర్శిస్తారు. వీరిని మార్గదర్శకులుగా పెట్టుకుని ఆంధ్రదేశంలో దేవదాసీలు, యానాదులు, యాదవులు, హరిజనులు, జంగాలు, మొదలైన వారు ప్రదర్శనలు ఇచ్చేవారు.

కూచిపూడివారి పగటివేషముల విషయంలో ఒకసంఘటన జరిగింది. ఆ రోజులలో నటకులతో కలసి భుజించరాదనీ, వారు అస్పృశ్యులని, తేలికదృష్టితో చూచేవారు. అది తూర్పుగోదావరి జిల్లాలోని ఒకగ్రామము. ఆ గ్రామములో ఛాందసులైన బ్రాహ్మణ కుటుంబములనేకములుండేవి. అదే గ్రామమునకు కూచిపూడి భాగవతులు వెళ్లుట తటస్థించింది. వీరి ప్రదర్శనకు ఆ గ్రామవాసులు ఎంతగానో అభ్యంతరము చెప్పుటచే వీరు ఇటులగాదని మరాఠీదండు వేషములవేసి ఢాల్ కత్తులు మెరయ అశ్వారూఢులై ఆగ్రామమును ముట్టడించారు. అంతట ఆ గ్రామస్థులు భయము చెందినవారై తలుపులు మూసికొని మరాఠీముతా నెంతగనో ప్రార్థించిరట. ఇట్లు కొంతకాలము కూచిపూడివారు మరాఠీవేషములతో భయపెట్టి తుదకు తమ నిజవేషములను వెల్లడిచేయగా ఆ గ్రామస్థులందరు ఆశ్చర్యచకితులై ఆ పగటివేషధారులైన కూచిపూడి కళావేత్తలను ఎంతగనో సత్కరించి గౌరవమర్యాదలతో పంపిరట!

ఒంగోలుతాలూకా తిమ్మవరంలో శ్రీ తిమ్మారప్ప వెంకటస్వామి అనునతడు అత్యుత్తమంగా వీధినాటకాలు నిర్వహించి సెబాస్ అనిపించుకున్నాడు. ఉత్తరగోగ్రహణము, శశిరేఖా పరిణయము, హరిశ్చంద్ర నాటకాలు వేసేవారు. అతడి జట్టులో సత్యభామ పాత్రధారిణి అలివేలు చాల అందగత్తె మాత్రమేకాక భాగవతం క్షుణ్ణంగాచదివిన నటి.

ఆ కాలంలో వీధినాటకాలలో సత్యభామ తనజడను తెరవెలుపల వేయడంద్వారా. సభలోకూర్చున్న పండితులను భాగవతం విషయమై ప్రశ్నిస్తే . జవాబుచెప్పగలనని సవాలు చేయడం ఒక సాంప్రదాయంగావుండేది. ఈ సవాలుకు పండితులు ఆగ్రహపడి భాగవతంలో పద్యాలకూ కృష్ణకర్ణామృతం శ్లోకాలకూ భావార్థాలు చెప్పమని అడిగేవారు. అలివేలమ్మ వాటికి సముచిత సమాధానాలుచెప్పి పండితులను మెప్పించేది!

క్రీస్తుకుపూర్వం మూడవశతాబ్దంలోనే తోలుబొమ్మలాట ఆంధ్రదేశంలో ప్రచారంలోవుండేది. ఈ తోలుబొమ్మలాట మనదేశంనుండి మలయా, ఇండోనీషియా, కంబోడియా, తాయిలాండు దేశాలకు వ్యాప్తిచెందింది. ఆదేశాలలో ఇప్పటికీ రామాయణ, భారత గాథలను తోలుబొమ్మలాటలుగా ప్రదర్శిస్తారు. తెలుగు తోలుబొమ్మలాట గుజరాతీలోకూడ అనుసరింపబడింది. ఇపుడు ఆధునికంగా శ్రీమతి మెహరు కంట్రాక్టరు అను నామె ఇందు మిక్కిలి కృషిచేస్తూవున్నది. తోలుబొమ్మలను ఆడించుటకు ఈమెను అమెరికాలోని వాషింగ్‌టన్ వాసులు ఆహ్వానించి ప్రదర్శింపజేసి, ఆంధ్రుల బొమ్మలాట నైపుణ్యాన్ని శ్లాఘించారు,

హిందూసమాజంలో వర్ణ తారతమ్యము లేకుండ ఎల్లరు సామూహికముగ ప్రార్థన సలుపుటకై భజనకూటములు గ్రామాలలో నుండెడివి. ఇందు భద్రాచల రామదాసుగారి కీర్తనలు చాలప్రచారంలో వుండేవి.

ఇంతేగాక పల్లెప్రజలు పడవలాగుతూ, కుప్పలు నూరుస్తూ, బియ్యందంచుతూ అనేకపాటలు పాడతారు.

ఆంధ్రప్రాంతంలో అనేక అడవులు, కొండలువున్నాయి. అదిలాబాద్ జిల్లాలో గోండులు నివసిస్తున్నారు. ఖమ్మం, గోదావరిజిల్లాలలో కోయలు, కొండరెడ్లు నివసిస్తున్నారు. కర్నూలు జిల్లా నల్లమల అడవులలో చెంచులువుంటున్నారు. వీరందరూ ఆయాసాంఘికమైన పర్వదినాలలో నృత్యవినోదాలు జరుపుతూ వుంటారు. అదిలాబాద్ జిల్లాలో గోండులు 'గుసాడీ' నృత్యం చేస్తారు. గోదావరిజిల్లా కొండప్రాంతాలలోని కొండరెడ్లు మామిడికోత నృత్యంచేస్తారు.

జానపదవాఙ్మయోద్ధారకులు స్వర్గీయనేదునూరి గంగాధరంగారికి ఈప్రత్యేకసంచిక అంకితమీయబడింది. (ఒక్కొక్క ప్రతివెల 5 రూపాయలు. ప్రతులకు సంగీతనాటకఅకాడమీ, కళాభవన్, సైఫాబాద్, హైదరాబాదు-4కు వ్రాయవలెను).

—సౌమిత్రి

—o—

* నిర్భాగ్యునికి నిద్ర, అభాగ్యునికి ఆకలిమెండు.
(అమితమైన నిద్ర, ఆకలి, అవగుణములుగా పరిగణిస్తారు)

చారిత్రక గాథ :

## "నేనే నీపుత్రుణ్ణి అనుకో!"

—శ్రీ పి. చంద్రశేఖరశాస్త్రి, ఎం. ఏ.

ఇప్పుడు ఆఫ్ఘనిస్థాన్ అని మనం పిలుస్తున్న దేశం పూర్వం గాంధార దేశం అని పిలువబడేది. రానురాను అది ముస్లిం రాజ్యమైపోయింది. అప్పుడప్పుడు అక్కడనుండి 'పఠాను' లని పిలువబడేవారు భారతదేశంపై దోపిడీలు, దండయాత్రలు చేస్తుండేవారు.

అవి పంజాబులో రంజిత్ సింగ్ పరిపాలిస్తున్న రోజులు. ఆయన వద్ద 'హరసింగ్ నల్వా' అనే సేనానాయకుడు ఉండేవాడు. చాలసార్లు పఠానులు ఆయన కత్తిపదును రుచి చూశారు. ఆయనంటే వారికి చాలాభయం. పఠాను ఇండ్లలో పాపాయిలు నిద్రపోకపోతే "హరసింగ్ వస్తున్నాడు-నిద్రపో" అని నిద్రపుచ్చేవారు. ఏదైనా ఒక గుఱ్ఱం నీరు త్రాగకపోతే "ఏం ! నీవెక్కడన్నా హరసింగ్ నల్వాను చూశావేమిటి ?" అనేవాళ్లు. ఈ విధంగా వాళ్లు హరసింగ్ నల్వా సేనాపతి అయిన తరువాత అప్రమత్తులై ఉండేవాళ్లు.

అది ఒక పఠాను క్షుద్రగ్రామం. ఒకరోజు ఒక ఇంటి అరుగుపై నలుగురు పెద్దలు హరసింగ్ నల్వాను గురించి మాట్లాడుకుంటున్నారు. అది వినటం కోసం ఆ ఇంట్లోనుండి ఒక యువతి బయటకు వచ్చి నిలబడింది. వాళ్ళ సంభాషణ పూర్తి అయ్యాక ఆమె వారిని అడిగి వివరములు తెలిసికొని

ఆశ్చర్యపోయింది. మనసులో ఆయువతికి అనేక భావాలు మెదిలాయి. వెంటనే ఆమె 'ఆయన ఎక్కడ ఉంటారు?' అని అడిగింది. ఆసమయంలో లాహోర్ సమీపంలో డేరాలు వేసు కొని ఉన్నారని సమాధానం వచ్చింది.

ఆనాటి రాత్రే ఆమె బయలుదేరింది. ఆవేదనకు సరి పోయిన వేగంతో నడుస్తూ తన దేశం దాటింది. చాలా రోజులు ప్రయాణంచేసి ఆమెదూరంగా కన్పిస్తున్న హారసింగ్ నల్వా నివాసాలు చూచింది. ఆనందంతో ఉప్పొంగింది. చరచరా నడచి డేరాలను సమీపించింది. డేరాలు మండలా కారంగా చక్కగా యేర్పాటు చేయబడ్డాయి. మధ్యలో ఒక డేరా ప్రత్యేకంగా నిర్మించబడి అలంకరింపబడి ఉన్నది. ఆ యువతి నేరుగా అలంకరింపబడిన డేరాను సమీపించింది. పహా రావాడు ఆమెను సమీపించి 'ఎవరికోసం?' అన్నాడు. "నేను హారసింగ్ నల్వాను చూడాలి. నావద్ద ఆయుధములేవీలేవు, వెదకవచ్చు" అన్నది నెమ్మదిగా. పహారావాడు సమాధానం చెప్పాడు: "ఆడుదానిచేత చంపబడేటంత భీరుడు కాడులే హార సింగ్ నల్వా" అని వెళ్ళడానికి అనుమతించాడు.

నెమ్మదిగా లోపలికి ప్రవేశిస్తూ నలువైపులా కలయ చూచిందాయువతి. ఏదో పరిశీలిస్తున్న హారసింగ్ నల్వాను చూచింది. మనసులో సంతోషపడ్డది. కొంతసేపయిన తరు వాత ఆయన పైకిచూసి అన్నాడు, "అమ్మా! ఎవరు నీవు? ఏంకావాలి?" అని.

"నీలాంటి పుత్రుడు కావాలి" అన్నదామె ఆదుర్దాగా.

ఆ కోరికలో ప్రత్యేకమైన అర్థం ఉన్నది.

"నాలాంటి కొడుకెందుకమ్మా, నేనే నీ పుత్రుణ్ణి అనుకో."

ఆ యువతి మాట్లాడలేకపోయింది. ముఖం వాడిపోయింది. ఒక పరాక్రమశాలి అయిన సేనాపతి వద్ద ఆమె అంతటి శాశీల్యాన్ని ఊహించలేదు. ఆమెభావాలన్నీ తలక్రిందులైనాయి. వెంటనే ఆమె వెనుతిరిగి వెళ్ళిపోయింది.

తన స్వగ్రామం చేరుకున్నాక ఆమె ఒకరిని పెళ్ళిచేసుకుంది. ఒక పుత్రునికూడా కన్నది. వాడూ పెరిగి పెద్దవాడయాడు. అప్పటికి హరిసింగ్ నల్వా చనిపోయాడు. ఆమె కొడుకుతో చెప్తూండేదట, "నాయనా! నీకు అన్న ఒకడుండేవాడు, ఆయన పేరు హరిసింగ్ నల్వా" అని!

---

* ఆకలిమించిన లోతు, బుద్ధికిమించిన పనిలేదు.

(ఆకలి వచ్చినవానికి నీరు ఎంతలోతున్నా పరవాలేదు. బుద్ధి సూక్ష్మతగలవాడెంత కార్యభారమైనా వహించగలడు)

* సంపదవల్ల అవగుణాలు బయటబడతాయి; కష్టాలవల్ల సుగుణాలు వెల్లడవుతాయి. —ఆంగ్లసామెత

ఆరోగ్య విషయాలు



## కాన్సరు వ్యాధికి కారణం

అమెరికా దేశంలో ఏడాదికి 3 లక్షలమంది క్యాన్సరు వ్యాధితో మరణించుచున్నారు; 5 లక్షలమంది క్రొత్తగా క్యాన్సరు వ్యాధికి లోనగుచున్నారు. ఇంగ్లండులోని రోగగ్రస్తులలో నూటికి 25 మంది క్యాన్సరు రోగులు.

'నవనాగరికతయొక్క అత్యంత ప్రమాదకరమైన పరిణామమే క్యాన్సరు వ్యాధి' అని జమ్మూలోని మెడికల్ ఇన్‌స్టిట్యూట్‌లో ఆ వ్యాధినిగూర్చి పరిశోధన చేయుచున్న డాక్టర్ కర్తార్‌సింగ్ జబ్‌వాలాగారు పేర్కొనుచున్నారు.

క్రిమి నాశక ఔషధములు, రంగులు, డబ్బాలలోను, సీసాలలోను నిల్వఉంచబడ్డ ఆహారములు మనలోని ప్రాణవాయువును మలిన పరచుచున్నవి. అందుచే క్యాన్సరువచ్చుచున్నది. ఈ వ్యాధినుండి రక్షింపబడుటకు అప్పటికప్పుడు చెట్లనుండి కోయబడిన తాజాపండ్లు, తాజాకూరలు, ఉడికించకుండ భుజించుట అత్యంతఅవసరము.

---

* ఎద్దులేనిసేద్యము, చద్దిలేని పయనము.

(వ్యవసాయపు సామెత)

* సత్యంచెప్పులు తొడుక్కునేలోగా అసత్యం భూప్రదక్షిణం చేసివస్తుంది! — ఒక ఆంగ్లకవి

# స్వేచ్ఛకు పరిమితి

మానవుడు స్వేచ్ఛను కోరుతాడు. తనకిష్టమైన విధంగా జీవించాలనీ, తనకిష్టమైనవృత్తి చేపట్టాలనీ, తన యిష్టాను సారమే ప్రతిదీ జరగాలని వాంఛిస్తాడు. ఇష్టంకానిపని కష్టంగా కనిపిస్తుంది. అయితే ఈ స్వేచ్ఛను అనుభవించటంలో ఏదైన పరిమితివున్నదా?

ఆంగ్లేయులు స్వేచ్ఛాభిలాషులు. సాంఘిక, రాజకీయ రంగములలో వారు స్వేచ్ఛను అనుభవిస్తారు. ఒకనాడు ఒక ఆంగ్లేయుడు హాయిగా వీధిలో నడుస్తూ పోతున్నాడు. తనచేతి కర్రను ముందుకూ వెనుకకూ వూపుకుంటూ వెళుతున్నాడు. ఇతని చేతికర్ర మొన వెనుకవస్తున్న మరొక పెద్దమనిషి ముక్కుకు తగిలింది.

"ఏమయ్యా! కళ్లు నెత్తికెక్కినవా? వళ్లు దగ్గరుంచు కొని నడువు. నీ చేతికర్రతో నాముక్కును కొడతావా?" అని కసిరాడు వెనుకనున్న వ్యక్తి.

"నేను స్వేచ్ఛ కలిగిన ఆంగ్ల దేశపు పౌరుడను. నాయిష్ట ప్రకారం మెలగడానికి ప్రభుత్వం నాకు స్వేచ్ఛయిచ్చింది. నా చేతికర్ర వూపుకునేస్వేచ్ఛ నాకున్నది. నువ్వెవరవు నాస్వేచ్ఛను అరికట్టడానికి?" అని మొదటివాడు నిర్లక్ష్యంగా జవాబిచ్చాడు.

అపుడు ఆవలిపెద్దమనిషి ఇలాఅన్నాడు: "మిత్రమా! నీ మాదిరిగా నేను కూడ స్వేచ్ఛాజీవితమును కోరెడి ఆంగ్ల దేశపు పౌరుడనే. నీకుస్వేచ్ఛ వున్నమాట వాస్తవమే. కాని పరులస్వేచ్ఛకు భంగం కలుగనంతవరకే నీవు స్వేచ్ఛను అనుభ

వించవచ్చు. చేతికర్ర ఊపుకొనే స్వేచ్ఛ నీకున్నమాట నిజమే. కాని, నాముక్కు ఎక్కడ ఆరంభమవుతుందో, నీ స్వేచ్ఛ అక్కడ అంతమవుతుంది సుమా! **(Your liberty ends where my nose begins)"**

ఇదే విధంగా మనంగూడ స్వతంత్రభారత దేశంలో అనేక సదుపాయాలను, వసతులను, హక్కులను అనుభవిస్తూ వున్నాం. మనకు అనేక వాంఛలుంటాయి. వీటిని పొందే టప్పుడు తోటి పౌరుల స్వేచ్ఛకు క్షేమానికి భంగం కలిగించటం లేదుగదాయని ఒకమారు తేరిపార జూచుకోవడం చాల అవసరం. లేనిచో ఒకరి సౌఖ్యాం మరొకరి క్షేమానికి విరుద్ధంగా, భంగకరంగా, తయారై పరస్పరం కలహించుకోవడం, ఇరువురూ స్వేచ్ఛను దుర్వినియోగం చేసుకోవడం జరుగుతుంది.

---

* ప్రేమ పల్చబడినపుడు తప్పులు చిక్కబడుతాయి.

(ఆంగ్లము)

(మనుష్యుల నడుమ ప్రేమ లోపించినపుడు వారిలో తప్పులు కానవస్తాయి. ప్రేమ వున్నంతవరకు తప్పులు కన్పించవు) **(Faults are thick when love is thin)**

* స్నేహితము సంతోషాన్ని హెచ్చిస్తుంది; దుఃఖాన్ని భాగిస్తుంది.

**(Friendships multiply joys and divide griefs)**

# మనమాతృభూమి

## కాశీ నగరము

భారత ప్రభుత్వముయొక్క చిహ్నము గర్జించుచున్న నాలుగుసింహములు. దీనిని మనం ప్రభుత్వకార్యాలయముల వద్ద, తపాలాకవరులమీద చూచివుంటాము. ఈచిహ్నం ఎచటనుండి గ్రహించబడింది ?

ఉత్తరప్రదేశ్‌లో కాశీపట్టణానికి 6 మైళ్ళదూరంలో సారనాథ్ అను చరిత్రాత్మకమైన ప్రదేశమున్నది. అచట అశోకుడు నిర్మించిన బౌద్ధస్తూపము, అశోక స్తంభము ఉన్నాయి. ఆ స్తంభము ఊర్ధ్వభాగంలో గర్జించుచున్న నాలుగు సింహముల ప్రతిమ కనిపిస్తుంది. ఇప్పటికీదానిని మనం చూడవచ్చు. దీనినే స్వతంత్రభారత ప్రభుత్వం తన చిహ్నంగా స్వీకరించింది.

సారనాథ్‌లో క్రీ. పూ. 532లో అచటగల జింకల వనమునందు గౌతమబుద్ధుడు తనయొక్క మొట్టమొదటి ఐదుగురు శిష్యులకు ధర్మబోధగావించాడు. ఇప్పటికీ జింకలనుపెంచు తోట అచటవున్నది. అశోకుడు నిర్మించిన బౌద్ధస్తూపము, ప్రాచీన శిల్పకళా ఖండాలను ప్రదర్శించే మ్యూజియము అచటవున్నాయి. అంతేగాక పాలరాతితో నూతనముగా కట్టించబడిన బౌద్ధమందిరం గూడవున్నది.

కాశీని వారణాసి లేక బెనారెస్ అనిగూడపిలుస్తారు. వరుణ, అసి అను రెండు చిన్ననదులు గంగానదిలో కలుస్తాయి.

ఆ రెండు నదులమధ్యగల ఈనగరానికి 'వారణాసి' అనే పేరు వచ్చింది. ఇది అత్యంత ప్రాచీనమైన క్షేత్రము. ఇచట విశ్వామిత్రుని పరీక్షకు ఎదురునిలిచిన హరిశ్చంద్రుడు కాటికాపరియై గంగానది యొడ్డుననే తన సత్యనిష్ఠను ఋజువుచేసికొనినాడు. నదీతీరమున హరిశ్చంద్రఘాట్ నేటికిని చూడవచ్చును. ప్రఖ్యాత హిందీకవి తులసీదాసు ఇచటనే తనరామాయణాన్ని గానంచేశాడు. ఆయన నివసించిన గృహము ఇప్పటికీవున్నది. భక్తకబీరుకూడ కాశీలోనే నివసించాడు.

ఇచట చూడతగిన ముఖ్యమైన భవనము భారత్ మాతా మందిరము. ఇది బాబూశివప్రసాద్‌గుప్తా అనువారిచే సుందరముగ నిర్మింపబడినది. ఇందు ఒక పెద్దహాలులో నేలమీద తెల్లటిపాలరాళ్ళతో భారతదేశపటము మనోహరముగ చెక్కబడినది. గోడలమీద గత వేయిసంవత్సరములలో భారతదేశం ఎట్లుపరాధీనమైనదో చిత్రీకరించబడినది.

మదనమోహన మాలవ్యాగారిచే 1300 ఎకరాలలో హిందూవిశ్వవిద్యాలయము 1916లో స్థాపించబడినది. అంతకు పూర్వం అనిబిసెంట్‌చే స్థాపించబడిన హిందూకాలేజిమాలవ్యా గారివలన విశ్వవిద్యాలయముగా రూపొందింది. యావద్భారతములోని అనేకమంది సంస్థానాధిపతులనుండి, కోటీశ్వరులనుండి విరాళములు సేకరించి దాదాపు కోటిరూపాయలు వ్యయపరచి మాలవ్యాజీ ఈ విశ్వవిద్యాలయం స్థాపించారు. ఇచట విశ్వవిద్యాలయములో ప్రవేశించే రెండురాజమార్గములకు వేదవ్యాసమార్గము, రాజా హరిశ్చంద్రమార్గము అనిపేర్లు పెట్టారు. మాలవ్యాజీ అంతిమకోరికప్రకారము విశ్వవిద్యా

లయ ప్రాంగణంలో నూతనముగా పరమశివుని దేవాలయం నిర్మించబడింది. సంస్కృతము, సంగీతము, ఆయుర్వేదములకు ఇచట ప్రత్యేకశాశాలలున్నవి.

కాశీ పూర్వకాలంనుంచీ విశ్వేశ్వరాలయానికి ప్రసిద్ధి చెందింది. అయితే 350 సంవత్సరాల క్రిందట ఔరంగజేబు కాశీ విశ్వేశ్వర దేవాలయాన్ని పడగొట్టించి ఆస్థానంలో ఒక మసీదు నిర్మించినాడు. ఆ మసీదు ఇప్పటికీవున్నది. అప్పటి దేవాలయమున కెదురుగానున్న నందివిగ్రహంమాత్రం నాశనంచేయబడలేదు. ఆవిగ్రహం ఇప్పటికీ మసీదుకెదురుగా కనిపిస్తూవుంటుంది. ఆ తర్వాత కాశీవిశ్వేశ్వరాలయం మరొక చిన్నప్రదేశంలో నిర్మించబడింది.

గంగానదిని జీవనదిగా పరిగణిస్తారు. సంవత్సరంలో అన్ని నెలలలోను గంగాజలం ప్రవహిస్తూవుంటుంది. ఇందలి నీటిని పాత్రలో ఎంతకాలందాచివుంచినా చెడిపోవు. హిమవత్పర్వతాలలో అనేక ఓషధులు ఇందు కలియడమే కారణం అయివుంటుంది.

---

* మరణము అందరినీ సమానము చేస్తుంది.

**(Death is the grand leveller)**

* ఒకడిని వదిలించుకోవాలనుకుంటే అతడికి అప్పివ్వు!

(ఆంగ్లసామెత)

# రోజు, సంవత్సరము ఎలా ఏర్పడ్డాయి?

రోజు, సంవత్సరము అనేవి ఎలాఏర్పడ్డాయి? సంవత్స రానికి ఎన్ని దినములుంటాయి?

భూమి తనచుట్టూతాను నిరంతరము తిరుగుతూ సూర్యునిచుట్టుగూడ తిరుగుతూఉంటుంది. ఈ రెండు విధము లైన భ్రమణములవలన మనకు దినము, సంవత్సరము ఏర్పడు తున్నాయి.

భూమి తనచుట్టూ తాను తిరగడంవలన సూర్యకిరణాలు భూమియందలి కొంతభాగములో మాత్రమేపడుతూ మిగతా భాగములో చీకటి ఆవరిస్తుంది. ఇలా భూమియందు సూర్యో దయ సూర్యాస్తమయాలు ఏర్పడుతున్నాయి. భూమి తన చుట్టూతాను ఒకమారు తిరగడానికి పట్టేకాలాన్ని ఒకదిన ముగా పరిగణిస్తున్నాము. ఒకదినమును 24 గంటలుగా విభ జించారు.

భూమి సూర్యునిచుట్టూ ఒకమారు తిరగడానికి 365¼ రోజులు పడుతుంది. దానికే సంవత్సరమని పేరు. ¼ రోజును విడిచిపెట్టి సంవత్సరానికి 365 రోజులుగా నిర్ణయించినారు. నాలుగేండ్లకు ఒకరోజు ఎక్కువచేసి, నాల్గవసంవత్సరము "లీపు" సంవత్సరమని పేరుపెట్టారు. ఆసంవత్సరానికి 366 రోజులు వుంటాయి. సూర్యుని ఆధారముచేసికొని ఏర్పడినది గనుక దీనికి సౌరమాస సంవత్సరమని పేరు.

చంద్రుడు భూమిచుట్టూ తిరుగుతూ, సూర్యునిచుట్టూ కూడ తిరుగుతున్నది భూమియొక్క ఉపగ్రహము. భూమికంటే పరిమాణములో చాల చిన్న గ్రహము. చంద్రుడు భూమిచుట్టూ తిరగడానికి 27⅓ రోజులుపడుతుంది. కాని అదేసమయములో భూమికూడ తనకక్ష్యలో తిరుగుతూఉండడంవలన అమావాస్య నుండి అమావాస్యవరకు షుమారు 29½ రోజులుపడుతున్నది. అట్టి 12 నెలలుగడిస్తే సంవత్సరము పూర్తిఅవుతుంది. అప్పుడు 354 రోజులే సంవత్సరమవుతున్నది. చంద్రుని నడకనుబట్టి ఏర్పడినది గనుక దీనిని చాంద్రమానసంవత్సరమంటారు. సౌర మాన సంవత్సరానికి (365¼) చాంద్రమానసంవత్సరానికి (354) నడుమ 11¼ రోజులు తేడావస్తున్నది. ఈతేడాను సవ రించుకోడానికై మూడేండ్లకొకమారు అధిక మాసమును ఏర్ప రిచారు. మన పంచాంగాలు చాంద్రమానాన్ని బట్టి రచింపబడ తాయి.

సూర్యచంద్రులు నడిచేమార్గానికి వెనుక 27 నక్షత్రాలు కన్పిస్తాయి. అశ్విని మొదలు రేవతివరకు వీటికిపేర్లున్నాయి. చంద్రుడు భూమిచుట్టూతిరిగే 27⅓ రోజులలో, రోజుకొక నక్ష త్రానికి చేరువగా ఉన్నట్లు కన్పిస్తాడు. అందుచేత పంచాం గంలో ఆనాటి నక్షత్రంపేరుకూడ పేర్కొంటారు.



* కలిసివచ్చే రోజు వస్తే నడిచివచ్చే కొడుకు పుడతాడు!

—తెలుగు సామెత

## ఎందరో మహనీయులు

# హనుమప్ప నాయుడు

ఇది మహబూబ్‌నగర్ జిల్లా గద్వాలకోటకు చెందిన కథ. 250 సంవత్సరాల క్రిందటి విషయం.

సోమనాద్రి యను సంస్థానాధిపతి కృష్ణానదీ సమీపమున గల గద్వాలలో కోట గట్టుకొని దానిని తన రాజధానిగా చేసుకున్నాడు. అచట అతడు కోటకట్టకూడదని, ఆ ప్రదేశం తన మండలంలోనిదనీ ఉప్పేడుకోటకు అధిపతియగు సయ్యద్ దావూద్‌మియా అభ్యంతరం చెప్పాడు. ఇరువురికీ నడుమ విరోధం ప్రబలి యుద్ధానికి దారితీసింది. గద్వాలకూ రాయచూర్‌కూ నడుమ "అరగిద్ద" యనుచోట భీషణసమరం జరిగింది. రాయచూర్ నవాబు అండదండలున్నప్పటికీ సయ్యదు సైన్యాలు ఘోరంగా పరాజయం పొందాయి. అత్యంత శక్తివంతమైన తెల్లని అశ్వమునధిరోహించి సోమనాద్రి ఏనుగుపై నెక్కి వచ్చిన సయ్యదును తరిమికొట్టాడు.

సయ్యదు ఎలాగైనా ప్రతీకారం చేయాలనే వాంఛతో గోల్కొండ వెళ్ళి నైజాం సహాయం అర్థించాడు. కర్నూలు నవాబు, నిజామునవాబు తమ సైన్యాలను సయ్యదునకు సహాయంగా పంపించారు. తుంగభద్రానదికి ఉత్తరమున "కలు

గొల్ల" యను గ్రామంవద్ద సోమనాద్రితో మరొక సంగ్రామం జరిగింది.

సోమనాద్రియొక్క బలం యావత్తూ అతని తెల్లగుఱ్ఱములో నున్నది. దానిని దొంగిలించి నట్లయితే సోమనాద్రికి కోరలుతీసినట్లవుతుందని భావించి శత్రువులు అర్థరాత్రి సమయంలో కాపలావాండ్రు నిద్రించు సమయంలో ఆగుఱ్ఱాన్ని అపహరించి తోలుకువెళ్ళారు. నిజాముయొక్క గుఱ్ఱాల సావిడిలో దాన్ని కట్టివేసి వుంచారు.

సోమనాద్రికి గుఱ్ఱంలేకపోవడంతో దక్షిణ హస్తం పడిపోయినట్లయింది. మరునాటియుద్ధం తనకు అనుకూలంగా లేదు. చీకటిపడింది. సర్దారులందరు కూర్చొనియుండగా శత్రు శిబిరంనుండి గుఱ్ఱాన్ని తేగల ధీరుడెవరని ప్రశ్నించాడు. అలా తెచ్చిన వానికి ఆగుఱ్ఱము దినమంతయు ఎంతభూమి తిరుగునో అంతభూమిని యీనాముగా ఇవ్వగలనని ప్రకటించాడు. హను మప్పనాయుడను బోయసర్దారు తాను అశ్వమును తీసుకొని రాగలనని ముందుకు వచ్చాడు.

హనుమప్పనాయుడు చొప్పకట్ట నెత్తిన పెట్టుకొని శత్రు శిబిరాలవైపు వెళ్ళాడు. గుఱ్ఱాలకు మేత కావాలిగదా! నిజాము సిపాయీలు లోపలికి పోనిచ్చారు. అడిగినవాళ్ళకు ఎక్కువ వెలచెపుతూ అమ్మకుండా లోపల తిరుగుతూ వున్నాడు. ఎట్టకేలకు సోమనాద్రియొక్క తెల్లగుఱ్ఱాన్ని చూడగలి గాడు. అచట కాపలావాళ్ళతో బేరమాడి చొప్పకట్ట దించాడు. డబ్బుతీసుకోవడంలో ఆలస్యంజరిపి, ఎవరూ లేకుండా

చూచి, గుఱ్ఱం సమీపంలో గల గడ్డిమోపుకింద దాక్కు-
న్నాడు.

గుఱ్ఱం తన కాళ్ళకు కట్టిన గూటము నూడబెరికింది. దాన్ని మరల భూమిలో పాతడానికి ఒక సిపాయి వచ్చాడు. గూటమును గడ్డిలోమోపి భూమిలో పాతి గుఱ్ఱాన్ని కట్టివేసి వెళ్ళిపోయాడు. గడ్డిలో చేతులుచాచి పసుండియున్న హనుమప్ప అరచేతిని గూటము చీల్చుకొనిపోయింది. ఎంత నొప్పి కలిగినను సహించి హనుమప్ప అలాగే నడిరేయి వరకు పరు న్నాడు.

డేరాలన్నీ మాటుమణిగిన పిదప హనుమప్పనాయుడు నడుములోని కత్తితో తన కుడిచేతిని నరుకుకొని, ఆ మొండి చేతిని తలపాగాలో చుట్టిఅశ్వము నధిరోహించి సోమనాద్రి సన్నిధికి వచ్చివాలాడు. తన ప్రభువునకు ఎడమచేతితో సలాము చేశాడు. సోమనాద్రి అది ఏమని ప్రశ్నించగా జరిగిన వృత్తాంతమంతా విన్నవించి తన మొండిచేతిని తలపాగానుండి తీసి చూపాడు. సోమనాద్రి ఆశ్చర్యచకితుడై నాయునికౌగలించుకొని అతనికి యీనాము బహూకరిస్తూ ప్రకటించాడు. మరునాడు జరిగిన యుద్ధంలో సోమనాద్రి అశ్వమునధిరోహించి కర్నూలువరకు శత్రువులను తరిమిగొట్టి విజయాన్ని సాధించాడు. నిజాముతో సంధిచేసుకున్నాడు.

హనుమప్పనాయుని త్యాగమునుగూర్చి గద్వాలలో ఇప్పటికీ చెప్పుకుంటారు. ప్రఖ్యాతచారిత్రక పరిశోధకులు శ్రీసురవరం ప్రతాపరెడ్డిగారు ఈగాథను "హైందవధర్మ వీరులు" అనుగ్రంథంలో చక్కగా చిత్రించారు.

## మాటా మంతీ

### ఆరుగురు సలహాదారులు!

జంతువుకంటె మనుష్యుడు ఎంత అదృష్టవంతుడు! జంతువుకు నాలుక వున్నది. కాని మాట్లాడలేదు. దానికి కోరి కలుంటాయి. కాని వెల్లడించలేదు. బాధలు పడుతుంది; కాని చెప్పలేదు. సంజ్ఞలతో, అరుపులతో, చేష్టలతో మాత్రమే తనబిడ్డలకు సూచించగల్గుతుంది.

మనిషి జంతువు కంటె అనేకవిధాల ఉన్నతుడు. అతను వివిధశబ్దాలు, మాటలు వెల్లడించగలడు. ప్రేమను, దుఃఖాన్ని తెలుపగలడు. అతడు ఆలోచిస్తాడు. అతనికి జ్ఞాపకశక్తి వున్నది. నిన్నజరిగిన దాన్ని బట్టి నేడు గుణపాఠం నేర్చుకుంటాడు. గొర్రెదాటుగా ఎవరో ఒక పని చేశారు గనుక తాను చేయడు. ఏమిటి? ఎందుకు? అనే జిజ్ఞాస అతనికున్నది. అందుకే Rudyard Kipling అను ఆంగ్లకవి ఇలా వ్రాశాడు:

**I keep six honest serving men,**
**(They taught me all I knew)**
**Their names are What and Why and When**
**and How and Where and Who.**

దీనిభావం: నిజాయితీతో సేవచేసే ఆరుగురువ్యక్తులు నాకున్నారు. నాకు తెలిసినది యావత్తూ వారే నాకు బోధించారు. ఆ ఆరుగురి పేర్లు ఇవి—ఏమిటి, ఎందుకు, ఎప్పుడు, ఎట్లు ఎచట, ఎవరు,

ఆంగ్లకవి వ్రాసిన ఈ పద్యం మానవుడు ఆలోచనాజీవి అని, హేతుబద్ధంగా అతడు వ్యక్తిస్తాడనీ, యావత్తు విజ్ఞానానికీ మూలం జిజ్ఞాసయేననీ తెలుపుతున్నది.

***

## భారతీయుల విమాన కౌశలం:

1914–18 నాటి మొదటి ప్రపంచయుద్ధ కాలంలో మొదటి సారిగా విమానములను పాశ్చాత్యులు వినియోగించారు. అంతవరకు ఆకాశయానం సాధ్యపడుతుందని వారు భావించలేదు. రామాయణంలో పుష్పకవిమానంయొక్క ప్రసక్తివున్నది. భారద్వాజుడు రచించిన వైమానిక శాస్త్రంలో విమాననిర్మాణం చర్చించబడింది. ఇందులో సుందర, శకున, రుక్మములను మూడు విధములైన విమాననిర్మాణములున్నవి. ఈ గ్రంథంలో 8 అధ్యాయాలు, 500 సూత్రములుఉన్నవి. అగ్నికి ఆహుతికాని విమానముల వర్ణనకూడా ఈ గ్రంథంలో వున్నది. ఈ విజ్ఞాన శాస్త్రానుసారంగా నిర్మించిన ఒక విమానాన్ని 1895లో బొంబాయిలోని చౌపతీ సముద్రతీరమున శివకామ్ బాపూజీ తల్పాడేయను ఒక పండితుడు ప్రదర్శించాడు! న్యాయమూర్తి మహాదేవ గోవింద రానడే ఈ విమానము 1500 అడుగుల ఎత్తునకు ఎగురుట చూచాడు.

—'ప్రజారథం' వారపత్రికనుండి

# దోసకాయ

—డాక్టర్ పి. నాగభూషణం

(ప్రిన్సిపాల్, జయసూర్య హోమియోపతి కాలేజి, హైదరాబాదు)

అనుదినమూ మనం భుజించే ఆకుకూరలు, కాయలు, పండ్లలో కొన్ని ప్రత్యేకమైన ఔషధగుణములున్నాయి. వాటిని మనం అర్థంచేసుకొని ఉడికించకుండా ఆయాకాయలను భుజించినట్లైతే కొన్నిరకములైన రోగములు నివారింపబడి ఆరోగ్యం చేకూరుతుంది. వాటిని వండటంవలన అందలి ప్రాణ శక్తినివ్వగల విటమినులు ఆవిరై బయటికిపోతాయి. ఈ విష యాన్ని ఒక అమెరికన్ వైద్యుడు వ్యంగ్యంగా ఇలా పేర్కొ న్నాడు. "మన వంటిళ్ళలోని గోడలు, కప్పు మనకంటె అధి కంగా పోషకపదార్థాలను పొందగలుగుచున్నాయి" (The walls and ceilings of our modern kitchen are more nutritious than us.) ఇప్పుడిప్పుడే పాశ్చాత్యవైద్యులు ఆహార నియమాలనుగూర్చి ప్రత్యేకశ్రద్ధ వహిస్తున్నారు.

జాన్ బి. లస్టు అను అమెరికన్ డాక్టరు Raw juice Therapy అను గ్రంథమువ్రాశాడు. అందులో మనంభుజించే మామిడి, దోస, అరటి, క్యారట్, ముల్లంగి, తోటకూర, మిరియము, అల్లము మొదలైన పదార్థములను తినడంవల్ల మానవశరీరంమీద ఎలాంటి ప్రభావం కలుగుతుందో వర్ణిం చాడు, అంతేగాక ఒక్కొక్క జబ్బు నయంకావడానికి ఏయే

కాయగూరలను, ఆకులను ఉడికించకుండా ఏయేపాళ్ళలో కలిపి, రసముతీసి త్రాగితే నయమవుతుందో విపులంగా పేర్కొన్నాడు. ఇలాంటిగ్రంథాలను వైద్యులు, ప్రజలుకూడచదవడం చాలఅవసరం. తెలుగులోకూడ కొందరిట్టివి వ్రాశారు. డాక్టర్ జాన్ బి. లస్ట్ వ్రాసిన గ్రంథంలో అనేకరకాల వ్యాధులకు తరచుగా ఉపయోగించదగిన ఆహార పదార్థంగా క్యారట్ దుంప, దోసకాయ ఉన్నాయి.

ఒక్కొక్క దోసకాయలో 70 యూనిట్ల 'ఎ' విటమిన్; 110 యూనిట్ల 'బి' విటమిన్, 400 యూనిట్ల 'సి' విటమిన్, ఇవిగాక క్లోరిన్, సిలికాన్, సోడియం, కాల్సియం, విటమిన్ 'బి—2' కలవు. దోసకాయతింటే సుఖవిరేచనం అవుతుందని అందరికీ తెలుసు. ఎందువల్ల? మూత్రపిండాలలోను, కాలేయం లోను ఏర్పడే దోషాలను దోసకాయ అరికడుతుంది.

కాలేయంలో పైత్యరసం తయారవుతుంది. అది ప్రేవులలోనికి పంపబడి ఆహారాన్ని జీర్ణంచేస్తుంది. అలా వెళ్ళేటటువంటి మార్గంలో ఆటంకమేర్పడితే అజీర్ణం కలుగుతుంది. పైత్యరసం ఒక్కొక్కసారి చిక్కబడి రాళ్ళుగాఏర్పడి ప్రేవులలోనికిపోయే మార్గానికి ఆరాళ్ళు అడ్డుపడతాయి. అలా అడ్డుపడటంవలన పసుపుపచ్చని పైత్యరసం ప్రేవులలోనికిపోకుండా రక్తంలోనికి ఎగతన్నుతుంది. అపుడు 'జాండిస్' (Jaundice) లేక కామెర్లవ్యాధి వస్తుంది. పైత్యరసం ఆహారంలో కలవకపోవడంవలన కామెర్లరోగికి విరేచనం తెల్లగా అవుతుంది;

అరసం రక్తంలో కలవడంవల్ల శరీరమూ, కళ్ళూ పసుపుపచ్చ రంగులోకి వస్తాయి.

మరి పైత్యరసం చిక్కనవడంవల్ల తయారైనరాళ్ళను కరిగించేశక్తి దేనికివున్నది? ఆశక్తి దోసకాయకున్నది. దోస కాయ కామెర్లురాకుండా నిరోధిస్తుంది.

మూత్రపిండాలలో ఆహారం జీర్ణంకావడంవలనయూరిక్ యాసిడ్ అనే పనికిరానిపదార్థం ఏర్పడుతుంది. అది మల మూత్రాలద్వారా బహిర్గతం కావాలి. అలా కాకపోతే రక్తంలో ప్రవేశించి కీళ్ళవాతాన్ని సృష్టిస్తుంది. అలాంటి యూరిక్ యాసిడ్ను రక్తంలో నిలవకుండా చేయగలశక్తి దోస కాయకున్నది.

ఇలా షుమారు 200 రకాల జబ్బులను నిరోధించగల శక్తి దోసకాయకున్నది. అందుచేత ఉడికించకుండా పచ్చిదోస కాయ తినడం చాల ప్రయోజనకరం. ముఖ్యంగా తలవెంట్రు కలు రాలకుండా ఆపడానికీ, నోటిపూతను నిరోధించడానికీ, నడివేసవిలో వడగాడ్పులయొక్క తాకిడికి తట్టుకోవడానికీ సహా యపడుతుంది.



* అన్నీ క్రొత్తగావున్నపుడు బాగుంటాయి; స్నేహం పాతబడితే బాగుంటుంది. (ఆంగ్లసామెత)

(Every thing is good when new, but friendship when old)

# ఛలోక్తులు

నవ్వొచ్చే సంగతులు ఎవరైనా చెప్తే ప్రతివాడూ చెవి కోసుకుంటాడు. వినాలని తహతహలాడుతాడు. కష్టాలతో కూడిన మానవజీవితానికి హాస్యభరితమైన సన్నివేశాలు కారు మబ్బులలో మెరుపులవలె ఆనందాన్ని చేకూరుస్తాయి.

జీవితంలో వికృతంగా కనిపించే ప్రతి సన్నివేశమూ నవ్వు కలిగిస్తుంది. చొక్కా తిప్పి తొడుక్కుంటే నవ్వుతాము. సాయంకాలంపూట పళ్ళుతోముతుంటే నవ్వుతాము. పురుషుడు చీరకట్టినా, స్త్రీలు ప్యాంటు తొడిగినా నవ్వొస్తుంది. అల్పుణ్ణి మహానుభావునిగా వర్ణించినా, గొప్పవిషయాన్ని చులకనచేసి చెప్పినా వినోదంగావుంటుంది.

ఒక కొండను ఎక్కడానికి ఎన్నో మార్గాలుంటాయి. అలాగే ప్రతివ్యక్తి తనకుగల అనుభవాలకూ, సంస్కారాలకూ అనుగుణ్యంగా వివిధరీతులలో హాస్యాన్ని అందించగలడు. వివిధరచయితలు తెలుగు సారస్వతంలో ఎన్నెన్ని విధాలుగా హాస్యాన్ని వెలువరించారో తెలుసుకుందాము.

ఛలోక్తులలో మేలిరకం హాస్యాన్ని మనంచూడగలం. ఎదుటివాడు ఎత్తిపొడవాలనిఏదో ఒకమాట అంటాడు. కుక్క కాటుకు చెప్పుదెబ్బ అన్నట్లు ఆ ఎత్తిపొడుపుకు చమత్కారంతో సమాధానమిచ్చినపుడు హాస్యంతొంగిచూస్తుంది. సంభాషణలలో చతురత చూపగల మేధావులు మాత్రమే ఛలోక్తులు విసరగలరు.

మహాకవి అని, అష్టావధాని అని కీర్తిగడించిన చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారిని ఒకరు "ప్రయాణానికి బయలుదేరినవానికి అడ్డంగా కుక్క ఎడమనుండి కుడికిపోతే మంచిదా, కుడినుండి ఎడమకుపోతే మంచిదా ?" అని ప్రశ్నించగా, "కరవకుండాపోతే మంచిది" అన్నారట శాస్త్రిగారు!

మరొకరు వారిని "పట్టుగుడ్డ ఎన్నాళ్ళవరకు మడి ?" అని అడిగారు. అందులకువారు "కంపుకొట్టనంతవరకు" అని జవాబిచ్చారు!

ఛలోక్తులలో తొంగిచూచే హాస్యం చాలసునిశితమైనది. ఛలోక్తి అవతలి మనిషిని బాధిస్తుంది. ఐనా అందులో వినోదంతో కూడిన విమర్శ వుంటుంది.

ఒకమారు ప్రఖ్యాత ఆంగ్లకవి బెర్నార్డుషాను ఒక సినిమానటి కలుసుకొని తనను వివాహమాడమని కోరింది. "నన్ను వివాహమాడితే మనకు కలుగబోయే బిడ్డకు మీ తెలివితేటలు నా అందమూ వస్తాయి. ఎంతో బాగుంటుంది. అంగీకరించండి" అని అడిగింది.

ఆయన చటుక్కున "ఒకవేళ నా అందమూ నీ తెలివితేటలూ వస్తేనో" అన్నాడు. సినీనటి నవ్వుకొని వెళ్ళిపోయింది!

ఒక కళాశాలలో ఒక తెలుగుపండితు డుండేవాడు. ఆయనను "మీకెన్నేళ్ళండీ" అని అడిగారు.

"ఎన్నో ఏళ్ళా ? ఏడేళ్లు" అన్నాడాయన.

ఏడేళ్ళంటే (7×7) నలుబది తొమ్మిది సంవత్సరాలన్న మాట!

ఇద్దరన్నదమ్ములు ఒకరినొకరు వాదులాడుకుంటున్నారు. పెద్దవాడు తమ్ముణ్ణి "బుద్ధిలేదట్రా" అన్నాడు.

చటుక్కున తమ్ముడు "నీకు కావాలిట్రా" అని ఎదురు ప్రశ్న వేశాడు!

అమెరికాదేశపు ప్రధానన్యాయమూర్తి ఎర్ల్‌వారెన్ మనదేశం సందర్శించినపుడు రేడియోలో ప్రసంగించారు. ప్రసంగం పూర్తయిన తరువాత ఆకాశవాణి అధికారులు "మీ శ్రీమతిగారు గూడ ఏదైనా మాట్లాడుతారా?" అని అడిగారు.

వారెన్ తనభార్యవైపు చిరునవ్వుతో చూసి ఇలా అన్నారు: "లేదు, ఈ విషయంలో మా ఇద్దరికీ ఒకరాజీ కుదిరింది."

"అంటే?"

"ఇదే—ఇంట్లో ఆమెమాట్లాడుతూవుంటే నేనువినాలి. బయట నేనుమాట్లాడితే ఆమెవినాలి".

నవ్వుకున్నారు ఆకాశవాణి అధికారులు!

స్వామి వివేకానంద ఒకసారి కొంతమంది వ్యక్తులతో ధార్మికవిషయాలు మాట్లాడుతూవుండగా జయపూర్ నుండి ఒక ప్రఖ్యాత పండితుడు విచ్చేశాడు. మాటలసందర్భంలో

ఆయన ఇట్లాఅన్నాడు : "నేనొకవేదాంతిని. అవతార పురుషుల ఆధ్యాత్మికశక్తిలో నా కేమాత్రం విశ్వాసంలేదు. పౌరాణిక అవతారాల్లోగూడ నాకు నమ్మకంలేదు. 'అహంబ్రహ్మ' అని నమ్ముతాను. అలాంటపుడు నాకూ, మరోఅవతారానికి తేడాఏమిటి ?"

వెంటనే స్వామీజీ ఇలాఅన్నారు : "మీమాట నిజమే. కాని హిందువులు మత్స్య, కూర్మ, వరాహ అవతారాలు నమ్ముతారు. మీరిందుదేనికి చెందినవారో చెప్పగలరా ?"

అక్కడున్నవారంతా నవ్వుతుంటే పండితులవారు సిగ్గుతో తలవంచుకున్నారు !

రెండుదేశాలవారు రైల్వేస్టేషనులో కూర్చొని తమ తమ దేశాలయొక్క ఘనతనుగూర్చి కోసేస్తున్నారు.

"మాదేశంలో డాక్టర్లు ఆశ్చర్యకరమైన ఆపరేషన్లు చేస్తున్నారు. ఒక పుట్టుగ్రుడ్డివాడికి ఆపరేషన్ చేసి గాజుకళ్ళు అమర్చితే అతనికి దృష్టివచ్చేసింది" అన్నాడు మొదటివాడు.

"మాదేశపు డాక్టర్లుచేసే అద్భుతాలక్రింద ఇది దిగదుడుపే" అన్నాడు రెండోవాడు.

"ఏంచేశారు మీ డాక్టర్లు ?"

"ఒక మొండిచేతివాడికి మా డాక్టరు ఆపరేషనుచేసి ఆవుచనులు తీసుకొచ్చి అతికించాడు. వాటినినోట్లో పెట్టుకు పీలిస్తే పాలొస్తున్నాయి."

"ఎవరుచూశారు దీన్ని?" అడిగాడు కోపంగా మొదటి వాడు.

"మీ డాక్టరుచేత కళ్లుపెట్టించుకున్న వాడే"!

"సాక్షి" వ్యాసాలద్వారా ఆంధ్రలోకానికి సుపరిచితు లయిన శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావుపంతులుగారికి ఒక సారి పిఠాపురంలో సన్మానంచేసి అనేకబహుమతు లిచ్చారు. అప్పటికి వారికి మతిస్థిరం తప్పుతున్నదనే అనుమానంవున్నదట. ఆ సన్మానానికి వారుకృతజ్ఞత తెలుపుతూ : "ఒక మతినే సరిదిద్దుకోలేకుండావున్ననాకు బహు మతులిచ్చారు"అన్నారట!

—శ్రీ బంగారు లక్ష్మణ్

---

* కట్టెవంపు పొయ్యిగాని తీర్చదు.
(పొయ్యిలో పెడితేనేగాని కట్టెలోని వంకరపోనట్లు కొందరువ్యక్తులలోని దోషాలు జీవితాంతంవరకు ఉంటాయి)

* స్వర్గద్వారాన్ని తెరిచే బంగారపు తాళపుచెవి త్యాగం.
(ఆంగ్ల సామెత)

* అజ్ఞానమువల్ల తప్పులుచేస్తాం, తప్పులవల్ల నేర్చు కుంటాం.
(ఆంగ్ల సామెత)




# చూడావత్ సింహుడు

—శ్రీ బొంనాద రామారావు, అనకాపల్లి

వారిద్దరికీ వివాహమై అప్పటికి ఇంకా వారంరోజులైనా కాలేదు.

చూడావత్ సింహుడు చిత్తూరురాజ్యపు సైన్యంలో ఒక అధికారి. తన ప్రియసతీమణి మధురాణితో సరససల్లాపాలాడుతూ ఉద్యానవనంలో షికారుచేస్తున్నాడు.

మధురాణి రసపుత్ర యువతి. రాజపుత్రుల సహజమైన సాహసం, ధైర్యం ఆమెలో మూర్తిభవించాయి. దేశభక్తి ఆమెకు వెన్నతో బెట్టినవిద్య. ఈ సుగుణాలు ఆమెయొక్క బాహ్యసౌందర్యాన్ని ఎంతో ఇనుమడింప జేస్తున్నాయి.

వారు తమ మధురానుభూతులను ఆనందంతో గుర్తు చేసుకుంటున్నారు. అదే క్షణంలో చిత్తూరు మహారాణా నుండి రాజభటుడొక అత్యవసరమైన లేఖ గొనివచ్చి చేతి కిచ్చాడు.

"మన మాతృభూమిమీద శత్రువులు దండయాత్ర చేస్తున్నారు. తక్షణమే బయలుదేరి రావాలి"అని రాణాకబురు చేశాడు,

చూడావత్ సందేహంలో పడ్డాడు. ఒకవైపు భార్యకు దూరం కాలేని స్థితి; మరొకవైపు మాతృభూమికి విపత్తు. ఈ సంశయంలో పడ్డాడు చూడావత్.

"మీరు రాణాయొక్క ఆజ్ఞ ప్రకారం రణభూమికి పోవడంలేదా?" అని అడిగింది మధురాణి.

"తప్పక వెళ్ళాలి. కాని,.... రేపటితో నా సెలవు ముగుస్తుంది. అందుచేత రేపు బయలుదేరుతాను" అన్నాడు చూడావత్.

భర్తయొక్క మనోభావాన్ని గ్రహించి మధురాణి ఇలా అన్నది: "రేపటివరకు ఆగవలసిన అగత్యమేమున్నది? ఈక్షణమే ఎందుకు బయలుదేరరు?.... స్వామీ! దేశం ప్రమాదంలో పడ్డప్పుడు, దేశస్వాతంత్ర్యానికే భంగం వాటిల్లినప్పుడు యిక్కడే కూచొని ఆనందం అనుభవించాలనుకోవడం తెలివితక్కువ. చిత్తూరే సర్వనాశనమైతే అప్పుడెవరు మిగులుతారు? అప్పుడు అనుభవించడానికి మాత్రం ఏముంటుంది?" అని ఆమె భర్తలో దాగివున్న ధైర్యాన్ని ప్రేరేపించింది.

చూడావత్ ఆమె మాటల్లోని సత్యాన్ని గ్రహించాడు. "దేశమే సర్వనాశనమైతే ఇక అనుభవించే దేముంటుంది?" అని భార్య పలికినపలుకు అతనిమనస్సును కదిలించి వేస్తున్నది. రివ్వున అశ్వమునధిరోహించి యుద్ధరంగానికి పయనమైనాడు.

కాని చూడావత్ మనస్సు భార్యమీదనేవున్నది. ఆమె లావణ్యం, సౌందర్యం గుర్తుకొస్తున్నాయి. అతడు యుద్ధంలో

తీవ్రతను గాని, తెగింపుగాని చూపలేకపోతున్నాడు. యుద్ధ భూమినుండి భార్యకు లేఖలు వ్రాశాడు. ఒకవేళ తాను మరణిస్తే మధురాణిని సహగమనం చేయవలసినదిగా సూచించాడు.

మధురాణి వివేకముగల స్త్రీ. తనమీది ప్రేమకారణంగా భర్త కర్తవ్యం నిర్వహించలేకపోతున్నాడని గ్రహించింది. తన భర్త మాతృభూమి రక్షణకు హృదయపూర్వకంగా యుద్ధం చేయలేకపోతున్నాడని గుర్తించింది.

మధురాణి సేవకుని పిలిచి " నీ సైన్యాధికారి దగ్గరకు వెళ్ళి నేను సరిగా నిర్వహించవలసిన బాధ్యతను స్వీకరించానని చెప్పు. మీ అధికారినికూడ రసపుత్రవీరుడుగా, మాతృభూమి సంరక్షకుడుగా తన బాధ్యతలను నిర్వహించాలని నా అంతిమకోరికగా చెప్పు !" అని తెల్పి సేవకుని ఒక వెండి పళ్లెం, ఖడ్గం పట్టుకురమ్మని ఆజ్ఞాపించింది. సేవకుడు వాటిని తెచ్చాడు.

మరుక్షణంలో మధురాణి "జై చిత్తూర్" అని నినాదంచేస్తూ చేతనున్న ఖడ్గంతో తన శిరస్సును ఖండించుకొన్నది. శిరస్సు వెళ్ళి పళ్లెంలోపడింది. ఆ శిరస్సు చూడావత్ వద్దకు తీసుకొని వెళ్ళి అందజేశారు. ఆమెయొక్క ఆఖరుమాటను తెలిపారు.

చూడావత్ మధురాణి శిరస్సును చూచి కంపించిపోయాడు. ఆమె త్యాగంలో ఆంతర్యం గ్రహించి తన కర్తవ్యాన్ని గుర్తించాడు. అశ్వము నధిరోహించి తనవెంట భార్య శిరస్సును పెట్టుకొని యుద్ధభూమిలో వీరవిహారం చేశాడు.

శత్రువులను చిందరవందర చేసి తరిమిగొట్టాడు. శత్రువులు సహితం ఆతని పరాక్రమానికి అచ్చెరువందారు. మాతృభూమి కాపాడబడింది.

ప్రాణంకంటె దేశం ముఖ్యమని ఎలుగెత్తి చాటిన వీర నారి మధురాణీయొక్క, వీరయోధుడు చూడావత్ యొక్క, గాథను ఇప్పటికీ చిత్తూర్‌లో ప్రజలు చెప్పుకుంటుంటారు.

---

* పక్షులు కాళ్ళవల్ల, మనుషులు నాలుకలవల్ల బంధితులవుతారు. (ఆంగ్లసామెత)

* ఇష్టమున్న సంసారం అరవై మూడు, ఇష్టలేని సంసారం ముప్పైఆరు. (౬౩ అను సంఖ్యలోని అంకెలు ఎదురెదురుగా చూస్తున్నాయి. ౩౬ సంఖ్యలోని అంకెలు ఎడమొగము పెడమొగములతో నున్నాయి. భార్యాభర్తలు అన్యోన్యంగా లేనపుడు ఈ సామెత వాడుతారు).

* కుట్టేవాళ్ళకు కుడిచేతిక్రింద, ఎడ్చేవాళ్ళకు ఎడంచేతి క్రింద కూర్చోకూడదు. (కూర్చుంటే సూది అయినా తగులుతుంది, జలుబునీళ్లైనా మీదపడతాయి).

# "నేను కేవలం గర్జించాను"

రెండవ ప్రపంచయుద్ధసమయంలో ఇంగ్లండు దేశానికి విన్‌స్టన్ చర్చిల్ ప్రధానమంత్రిగా ఉండేవాడు. ఆరోజులలో జర్మను సైన్యాలు బెల్జియం, హాలెండ్, ఫ్రాన్సుదేశాలను పాదాక్రాంతంచేసుకొని డన్‌కిర్క్ రేవువద్ద బ్రిటిషు సైన్యాలను ఘోరంగా ఓడించాయి. ఇంగ్లండు దేశంమీద రాత్రింబవళ్లు జర్మన్ విమానాలు బాంబులవర్షం కురిపించాయి.

అయినప్పటికి చర్చిల్ యొక్క నాయకత్వంక్రింద ఆంగ్లేయులు ప్రచండమైన ధైర్యసాహసాలనుప్రదర్శించారు. ఇంగ్లండుకు బయటిదేశాలనుండి ఆహారపదార్థాలు అందకుండా జర్మన్ నౌకాబలం అటకాయించేది. ఇంగ్లండ్‌లో ప్రజలు అతితక్కువ ఆహారంతో సరిపెట్టుకొని మాతృదేశరక్షణకై స్త్రీ పురుషులు పోరాటంలో పాల్గొన్నారు. తుదకు ఆరుసంవత్సరాల సుదీర్ఘమైన ప్రపంచయుద్ధంలో ఇంగ్లండు, దాని మిత్రదేశాలు గెలుపొందాయి. ఆవిజయానికి ప్రధానకారణభూతుడైన విన్‌స్టన్ చర్చిల్‌ను ఒకమిత్రుడు కలుసుకొని ఇలా అభినందించాడు:

"మిస్టర్ చర్చిల్, మీయొక్క సాహసోపేతమైన నాయకత్వంవలన బ్రిటన్ రక్షింపబడింది. మీకు ఆంగ్లజాతి యావత్తూ ఎంతో ఋణపడి ఉన్నది".

ఈ అభినందనకు చర్చిల్ ఏమాత్రము ఉబ్బిపోలేదు. ఇదంతా తన ఘనతయేనని ఒప్పుకోలేదు. పైగా ఇలా అన్నాడు.

"ఆగ్ల జాతికి సింహానికున్నంతటి గుండెఉన్నది. నేను కేవలం గర్జించాను" **(The nation has the lion's heart; I only roared).**

తనదేశానికి గణనీయమైన సేవచేసి మహాక్లిష్టపరిస్థితిలో దేశాన్ని కాపాడిన చర్చిల్ ప్రధాని తన ఘనతను అంగీకరించ లేదు. ఆ గొప్పతనం యావత్తూ ఆంగ్లజాతికి చెందుతుందనీ తాను కేవలం తనజాతి ప్రతినిధిగా గర్జనమాత్రమే చేశాననీ చెప్పుకున్నాడు! ఎంత నమ్రత; దేశంయెడల ఎంతవిధేయత!

ఒకవ్యక్తి ఎంతో గొప్పవాడు కావచ్చు; పరిపాలకుడు గానో విద్యావంతుడుగానో సైన్యాధినేతగానో రాజకీయవేత్త గానో ఉన్నత పదవి నలంకరించవచ్చు. అయినప్పటికీ తనతల్లికి కుమారుడే అవుతాడు. తనతల్లి అతనిని 'ఏమండి' అని పిల వదు; 'ఏంరా' అనే పిలుస్తుంది!

అదేవిధంగా తనదేశానికి, తనజాతికి అతడు లొంగి వుంటాడు. వాటిని అతిక్రమించడు. దేశం కంటె తాను అధికు డనని కలలోగూడ భావించడు. తన విద్య, తన తెలివితేటలు, తనశక్తియుక్తులు దేశంయొక్క అభ్యున్నతికొరకుమాత్రమే వినియోగిస్తాడు. అంతేగాని తనశక్తియుక్తులను తన మాతృ దేశానికి విరుద్ధముగా పొరపాటున కూడ వినియోగించడు.

ఒక ఆదర్శపౌరుని ఆలోచన అలా వుంటుంది!

---

* "కోపమునకు ఘనత కొంచమైపోవును" —వేమన

# కాంగ్రా గురుకులం

పంజాబులోని కాంగ్రా గురుకుల విశ్వవిద్యాలయంలో వసతిగృహం ఒకటున్నది. అచట రోగగ్రస్తులైన విద్యార్థులకు తోటివిద్యార్థులే సపర్యలు చేస్తూవుంటారు.

ఒకమారు సపర్యలు చేయడానికి నియుక్తుడైన విద్యార్థి శ్రద్ధగానే రోగిని కనిపెట్టుకొనివున్నాడు. ఇంతలో రోగి ప్రక్క మీదపొర్లి వాంతి వస్తున్నదని సైగచేశాడు. క్రిందనున్న ఉమ్మివేసేపాత్ర పూర్తిగా నిండివున్నది. వెంటనే సపర్యచేస్తున్న విద్యార్థి దాన్ని పారబోయించి కడిగించడానికై పాకీని పిలుచుకురావడానికై బయటకు వెళ్ళాడు.

కొన్ని నిముషాలు గడిచిపోయాయి.

విద్యార్థి తిరిగి గదిలో అడుగుపెట్టాడు. అతని ఎదుటనున్న దృశ్యం అతడిని చకితుడ్ని చేసింది. గురుకుల విద్యాలయ స్థాపకులు, స్వామి శ్రద్ధానందులనే పేరుతో సువిఖ్యాతులు అయిన మహాత్మామున్షీ రామ్ దోసిలిపట్టి నిలుచున్నారు. రోగి అందులో వాంతి చేసుకుంటున్నాడు. పూర్తిఅయిన తరువాత ఆయన బయటకువెళ్ళి చేతులు కడుగుకొని వచ్చి రోగిశిరం నిమురుతూ కూర్చున్నారు.

కొలదిక్షణాలైన తరువాత సపర్యచేయడానికి నియుక్తుడైన విద్యార్థితో "పాకీ వచ్చేదాకా వాంతి ఆగదుసుమా" అన్నారు. విద్యార్థి హృదయంలో కలిగిన లజ్జకు, పెల్లుబికే అతని కన్నీరే సాక్షి !

# మాటా మంతీ

## కార్యసాధకుడు

పని సాధించడమనేది ఒక కళ. జీవితంలో ఎట్టి బృహత్కార్యం సాధించాలన్నా పనిలో విమగ్నత అనేది ముఖ్యంగా అవసరం. ఆషామాషీగా, పట్టీ పట్టనట్లు వ్యవహరించడంవల్ల ఏ ఘనకార్యమూ సాధింపచబడలేదు. నెపోలియన్ లాంటివాళ్ళు మొదట నిద్రను, ఆకలిని జయించి ఆతరువాత దేశాలను జయించారు. వైద్యశాస్త్రంలోగాని, విజ్ఞానశాస్త్రంలోగాని ఆధునికమైన పరిశోధనలు చేస్తున్నవారు శారీరకమై సుఖాలను విస్మరించిన పిదపమాత్రమే విశిష్టమైన సత్యాలను కనుగొనగలుగుతున్నారు.

జీవితాన్ని సుఖపెట్టుకుందాం అనుకున్నంతవరకు జీవితంలో సుఖమే దుర్లభమవుతుంది. శ్రమనూ, కష్టాన్నీ ఆహ్వానించి ఒక విశిష్టమైన ఆదర్శాన్ని సాధించడంకోసం మానవుడు ప్రయత్నిస్తున్నపుడు ఆసాధనలో తనకుతృప్తి, ఆనందం లభిస్తుంది. అవసరమయితే కార్యసాధనకై అతడు అహంకారాన్ని తగ్గించుకొని వినమ్రుడౌతాడు. అంతేగాని అల్పుడు కాడు. ఈ సత్యాన్ని తెలిపే ఈక్రింది పద్యాన్ని పరిశీలిద్దాము.

“చేతనగువాడు కార్యము
కై తగ్గును వంగుగాక యల్పుండగునా?
ఏతము చడి దావంగును
పాతాళము నీరు తెచ్చి బయలులం జల్లున్”.

అజ్ఞాతకవి రచించిన ఈ పద్యము తెలుగుచాటుపద్యములలో మణిప్రాసవంటిది. ఏతము యొక్క కజ్జ బావిలోనికి దిగిపోతూఉంటుంది. పాతాళమంతటిలోతునకు పోతుంది. అది అంతలోతునకు పోగలుగుటవల్లనే నీటిని తెచ్చి వెలుపల చల్లగలుగుచున్నది. అట్లే కార్యసాధకుడు తన కృషిలో ఇతరుల యెడ నమ్రతచూపి తగ్గియుండునేగాని, అందుచేత అల్పుడు కాడు. ఎంతచక్కని పద్యమిది!



**హాస్యమంజరి :**

సీరా : చదువువచ్చినవాడు వ్రాసుకోవడానికీ, అది రానివాడు వేలిముద్ర వేయడానికీ పనికివచ్చేపదార్థం.

కావ్యం : అందరూ చదవనట్టి, చదివివుండవలసినట్టి గ్రంథరాజం.

రైలుపెట్టె : ఎంతమంది ఎక్కినా ఇంకొకడికి సీటువుండే ప్రయాణసాధనం.

గడియారం : నీకోసం కాలంఆగదుఅని తెలియచేసేసాధనం.

కోడి : పుట్టిన తరవాతేకాకుండా పుట్టకముందుకూడా తినటానికి పనికివచ్చే జీవి.

ఓటరు : పోలింగుస్టేషనుకు కారులోవెళ్ళి కాళ్ళతో తిరిగి వచ్చేవాడు.

—శ్రీ గోళ్ళమూడి గోపాలకృష్ణమూర్తి, ఎం. ఎస్‌సి.

# మానవునివలె మెలగడం నేర్వలేదు!

ఒక పెద్దమనిషికి చెవుడువచ్చింది. ఎంత బిగ్గరగా చెప్పినా వినిపించదు. ఆఫీసుకు వెళ్ళినా బజారుకు వెళ్ళినా ఎదుటివాడుమాట్లాడేది తనకు తెలియదు. ప్రతిదీకాగితంమీాద వ్రాసిచూపాలి.

అతని భార్య ఆయనను పేరుపొందిన డాక్టరువద్దకు తీసుకొనివెళ్ళి పరీక్షచేయించింది. "చెవుడు నయంకాదేమో నని ఆయన దిగులుపడుతున్నారు. ఆయనకు ధైర్యంచెప్పి నయంచేస్తారని మీావద్దకు తీసుకువచ్చాను" అని మరీమరీ చెప్పింది.

డాక్టరు రోగిని పరీక్షచేసి ఇలా అన్నాడు. "అమ్మా! ఈ రోజుల్లో వినతగ్గ మంచివిషయాలేవీవుండడంలేదు; చెవుడు నయంకాదని దిగులు పడవద్దని వారితో చెప్పండి."

నిజానికి ఈరోజుల్లో వినతగ్గవిషయాలు అంతగావుండ డంలేదు. పదవులకొరకు పోరాటాలు, ఆస్తికొరకు కలహాలు, ధనముకొరకు హత్యలు, జరుగుచున్నాయి. స్త్రీలకు రక్షణ లేకుండా పోతున్నది. పట్టపగలురక్తపాతాలు జరుగుచున్నాయి. అసూయ, ద్వేషములతో వాతావరణం నిండిపోతున్నది. మాన వుడు చంద్రలోకంలో అడుగుపెట్టినాడు; కాని భూలోకంలో చోటులేకుండా చేసుకుంటున్నాడు!

దీనికి కారణం ఏమిటి ? ఒకమారు బెర్ట్రాండ్ రస్సెల్ పేర్కొనినట్లు "మనుష్యుడు ఆకాశంలో పక్షివలె ఎగరడం

నేర్చాడు; నీటిలో చేపవలె ఈదడం నేర్చాడు; కాని భూమి మీద మానవునివలె మెలగడం నేర్వలేదు."

ఈ వాక్యంలో చాలా సత్యమున్నది. సముద్రంలో వరుసగా 50 రోజులపాటు జలాంతర్గామిలో ప్రయాణించి నీటి లోతులను పరీక్షించడం మనుష్యుడు నేర్చాడు. అంతరిక్షంలో 9 రోజులపాటు ప్రయాణించి చంద్రలోక యాత్రచేసి రాగలిగాడు. కాని సాటిమానవులతో ఆత్మీయతతో, అనురాగంతో, ఆప్యాయతతో మెలగడం నేర్చుకోలేక పోతున్నాడు. ఇది నేర్వగలిగితేనే మనం రూపొందించుకున్న నాగరికతకు, గ్రహించిన విద్యకు, వికసించిన మనస్సుకు, సార్థకతవుంటుంది.

***

* అప్పుడే సినిమా అయిపోయింది. జనం బయటికి వచ్చారు.

వర్షం జోరుగా కురుస్తోంది. ఎవరూ తడవడానికి సాహసించడంలేదు. ఒకడు గొడుగువేసుకొని గబగబా నడక సాగించాడు.

వెనుకనుంచి మరొకడు గబగబావచ్చి గొడుగులో తల దూరుద్దామని చూశాడు.

మొదటివాడు ఇతన్నిచూసి "మీదైతే మీరే తీసుకోండి, మీదైతే మీరే తీసుకోండి" అంటూ గొడుగు వదిలేసి వెళ్ళిపోయాడు!

ఎందరో మహనీయులు

# డాక్టర్ యల్లాప్రగడ సుబ్బారావు

—డాక్టర్ శంకరమల్లిఖార్జునరావు, ఎం. బి.; బి. ఎస్.

1923 అక్టోబరులో ఆయన లండన్ వెళ్ళారు. అప్పటికి 18 నెలల క్రితమే వివాహమైంది. భార్యను ఇచటనే వుంచి వెళ్ళారు. ఒకటి రెండేళ్ళలో స్వదేశానికి తిరిగి వస్తానను కున్నారు. కాని రాలేకపోయారు. 25 సంవత్సరాలు విదేశాల లోవుండి తుదకు అమెరికాలో 1948 ఆగస్టులో కన్ను మూశారు. తన ఆత్మీయులైన భార్యనుతల్లిని విడిచిపెట్టి జీవి తాంతమూ అతనిని విదేశాలలో నివసింపజేసిన ఆకాంక్ష ఏది? విజ్ఞానతృష్ణ; వైద్యరంగంలో పరిశోధనలు జరిపి మానవ కళ్యాణానికి పాటుబడాలనే ఆవేదన!

పేరెన్నికగన్న లెడర్లీ (Lederle) కంపెనీచే తయారు చేయబడిన అలోపతీ మందులు మనం బజారులో కొంటాము. అది అమెరికన్ కంపెనీ. ఆ కంపెనీయొక్క పరిశోధనా విభా గానికి ప్రధానడైరక్టరుగా వుండి అనేక అమూల్యమైన ఔష ధాలను కనిపెట్టినవారు డాక్టరు యల్లాప్రగడ సుబ్బారావు. ప్రపంచ విఖ్యాతిచెందిన లెడర్లీ కంపెనీవారు ప్రతిసంవత్సరమూ కృతజ్ఞతతో డాక్టర్ సుబ్బారావుగారి సంస్మరణదినం జరుపు తారట!

తూర్పుగోదావరిజిల్లా మోదుకూరులో 1896 జనవరి 13న శ్రీ సుబ్బారావు జన్మించారు. చిన్నతనంలోనే తండ్రి చనిపోయాడు. తల్లి వెంకాయమ్మ కాకినాడలో అతనిని పెంచి పెద్దవాణ్ణి చేసింది. రాజమండ్రి వీరేశలింగం హైస్కూలులో ఆయన చదివారు. మద్రాసు మెడికల్ కాలేజిలో ఎల్. ఎమ్. ఎస్. డిగ్రీ పొందారు. బంధువులూ మిత్రులూ వసూలుచేసి ఇచ్చిన చందాలతో ఆయన విద్యాభ్యాసం కొనసాగింది !

సుబ్బారావుగారి అన్నగారు జీర్ణకోశంలోని దోషం వలన ఆహారం రక్తంగా మారకపోవటం (Sprue) అను వ్యాధి వలన మరణించారు. ఆ వ్యాధికికారణం తెలుసుకొని మందు కనిపెట్టాలనే కోరిక సుబ్బారావుగారికి కలిగింది.

తనకు ఒకమారు నీళ్ళవిరోచనాలు వస్తే, అందుకు అలోపతీలో అప్పటికి మందులేకపోయింది. ఆయుర్వేద మందుతోనయమైనది. అందుచేత ఆయుర్వేదాన్నిగూడ ఆయన అభ్యసించారు. అమెరికాలో వైద్యపరిశోధనలు చేస్తూగూడా ఆయుర్వేదం పఠించేవారు. "ప్రపంచ వైద్యవిజ్ఞానానికి మార్గ దర్శనం చేయగల కాంతిరేఖలు ఆయుర్వేదంలో వున్నాయి" **(Ayuaveda has some guiding lights which show the way for World Medical Science)** అని వారన్నారు.

వారు మద్రాసులో వుండగా రామకృష్ణమిషన్ కార్యకలాపాలయెడ ఆసక్తి కలిగింది. అమెరికాలో బోస్టన్ నగరంలోగల రామకృష్ణమిషన్ కేంద్రం అతనిని ఆకర్షించింది.

శాస్త్రవేత్తగా వుంటూనే వేదాంతంలో కుతూహలంకలిగి వుండేవారు. "విజ్ఞానశాస్త్రం జీవితకాలాన్ని పొడిగిస్తుంది. మతంజీవితానికి లోతులు చూపుతుంది." (Science prolongs life. Religion deepens it) అని అనేవారు.

దొడ్డంపేట జమీందారు సహాయంతో లండన్ వెళ్ళి Tropical School of Medicine లో చేరారు తన 27వ ఏట. అచటినుండి అమెరికా వెళ్ళి హార్వర్డు మెడికల్ స్కూలులో చేరి నపుడు వారివద్దవున్న డబ్బు 150 రూపాయలు మాత్రమే! విరామసమయంలో ఇతరవృత్తులుచేస్తూ అమెరికాలో చదువు సాగించారు. జీవరసాయనికశాస్త్రం (Bio-Chemistry)లో ఉన్నతవిద్య నభ్యసించారు. Fisc అను శాస్త్రవేత్తతో కలిసి 1925లో శరీరంలో భాస్వరంగురించి పరిశోధన చేశారు. 1930లో బయోకెమిస్ట్రీలో రిసెర్చి డిగ్రీపొందారు. ఆయన ఆ రోజుల్లో రోజుకు ఇరువది రెండు గంటలు పనిచేసేవారు!

1940లో లెడర్లీ మందుల పరిశోధనాసంస్థ డైరెక్టరుగా నియుక్తులైనారు.

ఇపుడు విరోచనాలకు విరివిగా వాడుచున్న ఆరోమైసిన్ (Aureomycin) అను ఆంటిబయోటిక్ మందును కనిపెట్టినది మన యల్లాప్రగడ సుబ్బారావుగారే! అంతేగాక, మనము విరి విగా వాడుచున్న విటమిన్ బి-12ను, ఫోలిక్ యాసిడ్ను కని పెట్టిన డాక్టర్లబృందానికి నాయకుడు డాక్టరు సుబ్బారావు! ఆబృందం కనిపెట్టిన వాటిలో ముఖ్యమైనది మొక్కలకు కృత్రిమ ఎరువులు!

ప్రపంచ వైద్యరంగలో కీర్తినార్జించిన ఆ మహావ్యక్తి మాతృదేశం రాకుండానే అమెరికాలో కన్నుమూశాడు. అతని అస్తికలు అట్లాంటిక్ మహాసముద్రంలో కలుపబడ్డాయి. విజ్ఞానతృష్ణకోసం తల్లికి భార్యకూ దూరమైన మహనీయుడు డాక్టర్ సుబ్బారావు భారతదేశానికి, ఆంధ్రయువకులకూ గర్వకారణం.

శారీరక సుఖాలను వదలుకుంటేతప్ప ఘనకార్యాలేవీ సాధించబడవు !

---

# చిన్నకధలనుండి పెద్దసందేశం—2

శ్రీ జి. వి. ఎల్. నరసింహారావు

విజయం సాధించాలంటే ఎలాంటిమనస్తత్వంవుండాలి? వ్యక్తి ఏరకంగా ఆలోచిస్తే గెలుపుపొందగలడు ? అతనిలో ఎలాంటి భావనవుండాలి ?

ఒకానొకప్పుడు ఒక ఆంగ్ల దినపత్రిక గెలుపుకూ ఓటమికీ తేడా ఎంత అనే విషయం గురించి జరిగినసంఘటనలను ఉదహరిస్తూ వ్రాసినవారికి బహుమతు లిస్తామని ప్రకటించింది. ఇరువురు పాఠకులు వ్రాసిన రెండు గాధలకు బహుమతులు లభించాయి. ఆకథలు ఇవి :

ఒకఓడ నట్టనడిసముద్రంలో మునిగిపోయింది. రక్షణోపకరణాలు కొందరికే లభించాయి. వాటిని వినియోగించుకొని

వాళ్లు ప్రాణాలురక్షించుకొని ఒడ్డుకు చేరుకోడానికై పోతు న్నారు.

ఐదుగురుమాత్రం ఎలాంటి రక్షణలేకుండా సముద్రంలో పడి ఈదుతూ వున్నారు. ఒడ్డు అనేది వారికి వందలమైళ్ళ దూరంలో వున్నది. వారిలో నలుగురికి నిరాశ ఏర్పడింది. ఆఖరుకు మొసళ్ళకు ఆహారం కావలసివస్తుందే అని ఒకడు, ఈనీటిలో చావాలని భగవంతుడు రాసిపెట్టాడని మరొకడు, భార్యాపిల్లలు ఆఖరుక్షణంలో దగ్గరలేకపోయారే అని ఇంకొకడు, తనబ్యాంకులో డబ్బుఖర్చుచేయకపోతినే అని మరొకడు, ఇలా వాళ్ళకళ్ళముందు వివిధచిత్రాలు గుర్తుకువచ్చినాయి. నలుగురూ తామిక జీవించే ఆశలేదని మనస్సులో నమ్మకానికి వచ్చారు. ఆఖరుకు భగవంతుని నిందించ నారంభించారు. ఏప్పుడైతే వారి మనస్సులో బలహీనత వచ్చిందో అప్పటినుంచీ వాళ్లు సరిగా ఈదలేక మరణించారు.

ఆ ఐదోవ్యక్తిమాత్రం "నేను చావను. భగవంతుడు నన్ను అనవసరంగా సృష్టించాడంటే నమ్మను. నేను బ్రతికి తీరాలి" అంటూ శక్తినంతా కూడగట్టుకొని ఈదడం ప్రారంభించాడు.

దృఢనిశ్చయంలేని ఆ నలుగురూ మరణించిన ఐదునిము షాలకే ఒక విమానం అటు రావడం, దానిలోనివారు ఈదు తున్న వ్యక్తినిచూచి రక్షించడం జరిగింది! ఓడ మునుగుతున్న పుడు కెప్టెను వైర్‌లెస్‌ద్వారా చేసిన విజ్ఞప్తివలన ఆవిమానం వచ్చిందని అతడు తర్వాత తెలుసుకున్నాడు. విజయానికీ ఓటమికీ తేడా ఐదు నిముషాలని అతడంటాడు!

రెండవదిగా దక్షిణాఫ్రికాలో జరిగింది. ఒక అమెరికన్ కంపెనీవారు దక్షిణాఫ్రికాలో ఒక బంగారు గనిని త్రవ్వి బంగారాన్నంతా ఎత్తివేశారు. దానికి అడుగునకూడా మరొక గని వుంటుందని శాస్త్రవేత్తలు చెప్పగా త్రవ్వనారంభించారు. పదిఅడుగులు త్రవ్వినా బంగారం దొరకలేదు. ఇరవై అడుగులు త్రవ్వినా ఫలితం శూన్యం. ముప్పది అడుగులు త్రవ్వినా దొరికింది మట్టిమాత్రమే. నలభై అడుగులు త్రవ్వినా నిరాశయే కలిగింది. నిరాశతోనే యాభై అడుగులు త్రవ్వారు. మనస్సులో నిరాశ పెరగడం మాత్రమే జరిగింది. విసుగుతో డెబ్బది అడుగులు త్రవ్వారు. ఆఖరుకు 80 అడుగులుత్రవ్వి ఫలితంకనబడనందున ఆ ఖాళీగనులనువదలి అమెరికాకువెళ్ళారు. తరువాత వాటిని చౌకగా మరొకరికి అమ్మారు.

వాటిని కొన్నవ్యక్తి పట్టుదల కలవాడు. శాస్త్రవేత్తలు అబద్ధం చెప్పరు గనుక అక్కడ బంగారం దొరికేదాక కృషి చేయదలచి దక్షిణాఫ్రికాకువచ్చాడు. ఇదివరకటివాళ్ళు త్రవ్వినచోటున మరల త్రవ్వకాలు ప్రారంభించాడు. కేవలం మూడడుగులు త్రవ్వినవెంటనే అతనికి బంగారం లభించింది. ఆ కాలంలో అది ప్రపంచంలోకెల్లా పెద్దగని! గెలుపుకూ ఓటమికీ తేడా కేవలం మూడడుగులేనంటాడా పెద్దమనిషి.

ఏది ఏమైనప్పటికీ విజయం సాధించాలి అనే మహదాకాంక్ష విజయాన్ని చేకూరుస్తుంది. ఏ విషయంలోనైనా ఓడడంగాని గెలవడంగాని ముందు మనస్సుల్లోనే జరుగుతుంది. ఆతరువాతనే అది జీవితంలో కనబడుతుంది!

# భారత స్వాతంత్ర్య దినోత్సవము

190 సంవత్సరాల ఆంగ్ల దాస్యంనుండి భారతదేశం విముక్తిచెంది 1947లో స్వరాజ్యాన్ని పొందింది. గత 23 సంవత్సరాలుగా మనం అనుభవిస్తున్న స్వతంత్రానికి వెనుక ఎంతమంది దేశభక్తులు తమ ప్రాణాలను బలిదానం చేశారు? ఎంతమంది తమజీవిత పుష్పాలను మాతృదేవి చర ణాలయెదుట సమర్పించారు? కీర్తిప్రతిష్ఠలను స్వప్రయోజనాన్ని స్వల్పంగానైనా కోరకుండా తమ జీవితసర్వస్వాలను ఎంత మంది ధారపోశారు? వారిలో కొందరినైనా గుర్తుచేసుకొని దేశభక్తిని అలవరచుకోవడానికై మనం ప్రయత్నిస్తున్నామా?

భారతజాతీయ ఉద్యమంలో అసువులనర్పించిన మహా నీయులలో శ్రీమతి సరోజినీనాయుడు పేరెన్నికగన్నది. ఆమె సోదరులు సహితము ఆంగ్లసామ్రాజ్యానికి ఎదురొడ్డినిలిచి విప్లవవీరులుగా ప్రసిద్ధి చెందినారు. ఆమెసోదరుడు శ్రీవీరేంద్ర నాథ ఛటోపాధ్యాయ విద్యార్థిదశలో ఐరోపాకువెళ్ళాడు. అచట ఇంగ్లండు, ఫ్రాన్సు, జర్మనీ, స్విట్జర్లండు దేశాలలో చాలాకాలంగడిపాడు. అచటినుండి భారత స్వాతంత్ర్యసాధనకై పథకములు రూపొందించాడు. అతడు చక్కనికవి. "మై హిందూస్థాన్" అను ఆంగ్లగేయంలో తన దేశాభిమానాన్ని వెల్లడిస్తూ దేశస్వాతంత్ర్యంకోసం వేయిజన్మలైనాయెత్తి తన రక్తాన్ని మాతృదేశంకొరకు ధారపోస్తానని గొంతెత్తి చాటాడు :

"వదలింపగ నీ బానిసతనంబును
వేయిసార్లు జన్మించెద నీగర్భంబున
వేయిసార్లు పారించెద నా రక్తంబును
ఓ హిందూదేశమ! నాహిందూదేశమ!!"

అతడు ధనముకొరకు, కీర్తికొరకు, తనవిగ్రహాల ప్రతిష్ఠాపనకొరకు ఆశపడలేదు. శత్రువుల దుమ్ముతో మలినమైయున్న మాతృభూమిని తనరక్తంతో కడగదలచి ఇలావ్రాస్తున్నాడు:

"తపించను నే సంపదకై, నాప్రతిమలకై
శత్రుధూళి ధూసరితంబగు నీతనువును
తపింతును నారక్తధార కడుగగ
ఓ హిందూదేశమ! నాహిందూదేశమ!!"

మాతృభూమిమీదప్రేమ తనయొక్క పాపమును, శోకమును తొలగించునట్టి ఒక పవిత్రజ్వాల అని, అది తనను ఒక యోగ్యుడైన పుత్రునిగా తయారుచేయగలదని భావిస్తూ ఇలా అంటాడు:

"నీమీద ప్రేమ ఒక పవిత్రజ్వాల
దహించునది నాపాపశోకముల
మరి నను చేయును నీయోగ్యపుత్రులీల
ఓ హిందూదేశమ! నాహిందూదేశమ!!"

అతడు దేశాన్ని స్వతంత్రం పొందునట్లుగా చూచి సంతోషించాలని ఆశించలేదు. స్వాతంత్ర్యభవనముయొక్క పునాదిరాయిగా వుండదలిచాడు :

"చూడంగోరను నిను స్వతంత్రముగ
మరి-నీ స్వాతంత్ర్యభవనపు పునాదిగ
వాంఛింతును నేనాహుతి కాగ
ఓ హిందూదేశమ! నాహిందూదేశమ!!"

ఈ విధంగా దేశభక్తిని గానంచేసిన మహనీయుడు 1942లో పరమపదించాడు. నేడు స్వాతంత్ర్యదినోత్సవం జరుపుకొనుచున్నాము. వినోదాలతో, విందులతో గడుపుచున్నాము. అంతేగాని మనం అనుభవిస్తున్న స్వేచ్ఛను స్వతంత్రాన్ని సంతోషాన్ని నిలబెట్టుకోవాలంటే ఎంతటి ఖరీదును చెల్లించాలి? ఎంతటిదేశభక్తిని అలవరచుకోవాలి? మనలోమనం ఎంతటి ప్రేమను, పరస్పర సహకారాన్ని పెంపొందించుకోవాలి? అందుకై శ్రీవీరేంద్రనాథఘటోపాధ్యాయవ్రాసిన గేయంలోని భావాన్ని క్షణక్షణమూ మననం చేసుకోవలసిన అవసరం ఎంతైనావున్నది. జై....జై....భారత్.

---

* దున్నకుండా చల్లితే కొయ్యకుండా పండుతుంది! (శ్రమపడని వ్యక్తికి ఫలితం శూన్యం)
* "నోరా వీపుకు తేకేం"! (విచ్చలవిడిగా మాట్లాడి వీపుకు దెబ్బలు తీసుకురావద్దని నోటికి విజ్ఞప్తిచేయడం)

—తెలుగు సామెతలు

# మహామంత్ర

## ఎవరికి థ్యాంక్స్ చెప్పాలి ?

పొందినమేలు మరువక కృతజ్ఞత కలిగియుండడమనేది మర్యాదగలవాని లక్షణం. ఫలహారంపెట్టినా, కాఫీఇచ్చినా "థాంక్స్" చెప్పడం ఆంగ్లేయుల అలవాటు. ఇప్పుడది మన వాళ్ళకుగూడ అలవాటయింది. ఎవరినుండి ఏ కొద్దిఉపకారం పొందినా కృతజ్ఞత తెలుపడం విజ్ఞతగలవాని కనీస ధర్మం.

ఉపకారం చేసినవానికే అపకారం చేయడం దుర్జనుని లక్షణం. అలాంటి వారిని మనం అసహ్యించుకుంటాం. పాలు త్రాగినరొమ్మునే గ్రుద్దినాడని నిందిస్తాం. తిన్న ఇంటివాసాలు లెక్కబెడుతున్నాడని విమర్శిస్తాం.

మరి అలాంటప్పుడు మనం ఎవరియెడల జీవితాంతమూ కృతజ్ఞతచూపాలి? ప్రాణాపాయ సమయంలో మందిచ్చివ్యాధి నయంచేసిన డాక్టరు ఎడ, ఉద్యోగమిచ్చి జీవితానికి మార్గం చూపిన అధికారిఎడ కృతజ్ఞత కలిగివుంటాం.

అంతకంటేగూడ ముఖ్యులింకెవరైనా వున్నారా! ఉన్నారు. జన్మను ప్రసాదించిన తల్లిదండ్రులయెడ, జ్ఞానభిక్ష పెట్టిన గురువుయెడ, సృష్టికర్త అయిన పరమేశ్వరునియెడ నిరంతరము విధేయతచూపడం వివేకవంతుని లక్షణం.

వీరందరికంటె ముఖ్యమైనది మరొకటివున్నది. దానిని ఎన్నడూ మనదృష్టికి తెచ్చుకోవడంలేదు. మనం ఎచట నిల

బడ్డాం ? ఎచట నిద్రిస్తున్నాం ? ఎచట కూర్చొని ఆహారాన్ని స్వీకరిస్తున్నాం ? మన ఉనికికి ఆధారమేమిటి ? ఏది లేకుంటా మనం లేము ?

ఏదిలేకుంటా మనములేమో, ఆ "దేశాన్ని" మరచిపోతున్నాం. రోజూ ఒక్కమారైనా మన మాతృభూమిని గుర్తు చేసుకుంటున్నామా ? దానిపేరు ఆనందంతో ఒడలు పులకించే రీతిలో స్మరిస్తున్నామా ? ఆ పుణ్యభూమియొక్క విమలచరిత్రను గుర్తుచేసుకుంటున్నామా ? కాఫీపోయించినవాడికి "థాంక్స్" చెప్పే మనం, మనఉనికికి కారణమైన భరతభూమికి రోజూఒక్కమారైనా ప్రేమతో, సజలనయనాలతో కృతజ్ఞత తెలుపుతున్నామా? అందుకై శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారి గీతాన్ని మననం చేసుకుందాం:

శ్రీలుపొంగిన జీవగడ్డయి
పాలుబారిన భాగ్యసీమయి
వరలినది ఈ భరతవర్షము
భక్తిపాడర తమ్ముడా!

మాతృదేశంమీద ప్రేమాభిమానాలను రగుల్కొల్పి ఉత్తేజపరచే మధురమైన గీతంలోని మొదటి చరణమిది!

---

* "పరిపాలనలో పాల్గొనడానికి బుద్ధిమంతులు నిరాకరించి దూరంగావుంటే, దుష్పరిపాలనక్రింద జీవితం గడిపే శిక్ష వారు అనుభవించవలసివుంటుంది."—ప్లేటో.

# తిరుపతి వేంకట కవులు

వినాయకచవితినాడు నాగులచవితి ఎలా వస్తుంది? భాద్రపదశుద్ధ చవితి వినాయకచవితి. కార్తీకశుద్ధచవితినాగుల చవితి. ఈ రెండూ ఒకనాడే ఎలా వస్తాయి? దీనిని ఎలా సమర్థించడం?

కిర్లంపూడి జమీందారు చేయించిన అష్టావధానంలో తిరుపతి వేంకటకవులకు "గణచతుర్థి నాడు ఫణిచతుర్థి" అను సమస్య నివ్వగా వారు దాని నిలా పూరించారు:

> "ఎన్ని దినములాయె నిట నన్నుడించి నీ
> వరిగి" యనినఁ బత్ని కనియె భర్త
> "నేటికెన్నఁగఁ బదినెల లాయెఁగా! నేఁడు
> గణచతుర్థి; నాఁడు ఫణిచతుర్థి".

"నన్ను ఇచట దించి మీరు వెళ్ళి ఎన్నిదినములైన" దని భార్య భర్తనడుగగా, భర్త ఇలా అన్నాడు: "నేటికి పదినెలలైనది. నేడు వినాయకచవితి, ఆనాడు నాగులచవితి".

ఇలా అర్థము పొసగనటువంటి పద్యపాదాన్ని సమస్యగా ఇస్తే దానిని సక్రమమైన అర్థం వచ్చే రీతిలో పద్యంలో చెప్పే ప్రక్రియను సమస్యాపూరణమంటారు. ఈపద్ధతి సంస్కృతాంధ్ర

భాషల్లో మాత్రమే వున్నది. అష్టావధానంలో ఇది యొక ముఖ్యభాగము.



అవధానంలో వ్యస్తాక్షరి చాల కష్టమైన ప్రక్రియ. ఒక భాషలోని వాక్యమును తీసుకొని అందలి అక్షరములకు సంఖ్యలు వేసి, విచ్చలవిడిగా మొదట 10వ అక్షరం, తరువాత 2వ అక్షరం, ఇలా ఇష్టమొచ్చినట్లు చెపుతూవుంటే, అవధాన మొనర్చు కవులు వాటిని మనసునందుంచుకొని ఆఖరునకు ఆ వాక్యాన్ని సవ్యమైన రీతిలో చెప్పగలగాలి. తిరుపతివేంకట కవులు ఆంధ్రసంస్కృత భాషలలోని వాక్యాలనేగాక తమకు ఏమాత్రమూ తెలియని జర్మన్, లాటిన్ భాషల్లో మాటలు ఇచ్చినప్పటికీ చెప్పెడివారు. ఇది వారి జ్ఞాపకశక్తికి ఘనవిజయము. ఆనాటి జిల్లా కలెక్టర్లు, ఇతరయూరోపియన్ ఆఫీసర్లు వీరి ధారణాశక్తికి ఆశ్చర్యపోయారు. 1893లో వీరి అష్టావధానాన్ని మద్రాసులో తిలకించి అనీబిసెంటు మిక్కిలి అచ్చెరువందినది.



ఇలా తెలుగు సారస్వతానికే గాక యావద్భారతానికీ కీర్తి తెచ్చిన తిరుపతివేంకటకవులు అన్నదమ్ములుకారు. ఒకరు దివాకర్ల తిరుపతిశాస్త్రి, రెండవవారు చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి. తిరుపతిశాస్త్రిగారిది కృష్ణాజిల్లా ఎండగండ్రగ్రామం. జననం 1871, మరణం 1919. వేంకటశాస్త్రిగారిది కాకినాడవద్ద యానాం; నివాసము గోదావరిజిల్లా కడియం. 1870లో జన్మించి 1950లో దివంగతులైనారు.

తిరుపతి వేంకటకవులు యావదాంధ్రలో విజయవిహారము సల్పి 109పైగా అష్టావధానములుచేసి సన్మానములందినారు. వారి శతజయంత్యుత్సవములు 1970–71లో రాష్ట్రమంతటా జరిగినాయి. వారు దివంగతులైనా, వారు రచించిన పాండవోద్యోగవిజయం నాటకంద్వారా గ్రామగ్రామానా ప్రజల మనస్సుల్లోకి వస్తూనే వున్నారు. మరణ మెరుగని కవిత వారిది!



## చరిత్ర నేర్పే గుణపాఠం

“మందమతి అయితేతప్ప ఒకేగోతిలో రెండుసార్లు పడడు” అని టర్కీ భాషలో ఒకసామెతఉన్నది. మొదటిసారి ప్రమాదవశాత్తూ కాలుజారి గోతిలోపడడం ఎవరికైనా జరుగవచ్చుగాని అదేగోతిలో రెండవసారి పడి ప్రమాదం తెచ్చుకున్నవాడు బుద్ధిహీనుడని చెప్పకతప్పదు. ఒకసారిజరిగిన చెడ్డ అనుభవాన్నిబట్టి గుణపాఠం నేర్చుకొని, మరల అదే విపత్తు వాటిల్లకుండా జాగరూకతవహించడం వివేకవంతుల లక్షణం.

వ్యక్తివలెనే సమాజంకూడ కొన్ని తప్పులుచేసియుండవచ్చు. వాటి ఫలితంగా అనేక కష్టనష్టాలను ఎదుర్కొనియుండవచ్చు.

తప్పుచేయడం తప్పుకాదు; కాని అదేతప్పును పలుమార్లు చేసి కష్టాలను మీదవేసుకొనడం అన్నిటికంటె పెద్దతప్పు.

ఇందుకు భారతదేశచరిత్రయే జటిలమైన ఉదాహరణ లను పెక్కింటిని మనముందుంచుతుంది.

పాకిస్తాన్‌తో సహా భారతదేశంయొక్క విస్తీర్ణం 15 లక్షల 83 వేల 553 చదరపుమైళ్ళు. 1951 జనాభాలెక్కల ప్రకారం ఈ రెండుదేశాల జనసంఖ్య 43 కోట్ల 66 లక్షలు.

ఇంగ్లండు దేశంయొక్క విస్తీర్ణం 94 వేల 494 చదరపు మైళ్ళు మాత్రమే. ఇందులో స్కాట్లండు, వేల్సు, ఉత్తర ఐర్లండు కలిసివున్నాయి. ఆదేశంయొక్క జనసంఖ్య 1951 లెక్కలప్రకారం 5 కోట్ల 3 లక్షల 69 వేల 585.

భారతదేశంయొక్క విస్తీర్ణంలో కేవలం 16వ వంతు విస్తీర్ణం కలిగియుండి, భారతదేశ జనాభాలో 8వ వంతు జన సంఖ్యను కలిగియుండి మన దేశానికి రమారమి పదివేలమైళ్ళ దూరంలో వున్నటువంటి ఆంగ్లేయులు మనదేశాన్ని ఎలా జయించగలిగారు? జయించినపిదప ఒక సంవత్సరంకాదు, రెండు సంవత్సరాలుకాదు–190 సంవత్సరాలపాటు ఈ దేశాన్ని తమ ఆధిపత్యంలో ఎలా వుంచుకోగలిగారు? 1757 ప్లాసీయుద్ధం మొదలు 1947 వరకు ఇంత విశాలదేశంలో కొంతభాగాన్ని గాని, యావత్తుదేశాన్ని ఎలా పాదాక్రాంతం చేసుకోగలిగారు? స్వతంత్రభారత పౌరులమైనమనం దీర్ఘంగా ఆలోచించి ఈ ప్రశ్నలకు సమాధానాలను అన్వేషించాలి. ఇది ఏదో కాక తాళీయంగా జరిగిన సంఘటనకాదు. ఇది మనం పట్టించు కోకుండా వదలదగిన స్వల్పవిషయంగాదు. పరాక్రమంలోను, మానవశక్తిలోను, ప్రకృతిసంపదలోను, నాగరికతలోను ఏ

దేశానికీ తీసిపోని భారతీయులు ఏవిధంగా బ్రిటిషువారికీ, అంతకుపూర్వం ఫ్రెంచి, పోర్చుగీస్, మొగల్, ఆఫ్ఘన్ దండయాత్రలకు తలవొగ్గారు?

ఏ దోషాలు మన సమాజంలో వుండడంవలన మనం ఒకప్పుడు పరదేశీయులకు దాసోహమన్నామో, ఆ దోషాలేమిటో తెలుసుకొని వాటిని పట్టుదలగా ప్రయత్నపూర్వకంగా మొదలంట పెరకివేయకపోయినట్లయితే మనం మన స్వారాజ్యాన్ని రక్షించుకోవడం కష్టతరమవుతుంది. ఆయాలోపాలను తెలుసుకోడానికి యత్నిద్దాము.

ఇంగ్లీషువారికంటె ముందు ఫ్రెంచివారు దక్షిణభారత దేశంలో తమ రాజకీయ ఆధిపత్యాన్ని స్థాపించడంకోసం ప్రయత్నించారు. 1746లో జరిగిన మొదటి కర్నాటకయుద్ధంలోనూ, 1749లో జరిగిన రెండవ కర్నాటకయుద్ధంయొక్క ఫలితంగానూ ఫ్రెంచివారి ఆధిపత్యం దక్షిణభారతదేశంలో స్థాపించబడింది. నైజాంనవాబు ఫ్రెంచివారికి అనుయాయుడైనాడు. ఈ విజయానికి కారణభూతుడు ఫ్రెంచిగవర్నరు డూప్లే.

డూప్లేయొక్క జీవితచరిత్రను ఒక చరిత్రకారుడు వ్రాశాడు. అందు డూప్లేయొక్క విజయానికి కారణభూతమైన ఒక ముఖ్యసత్యాన్ని ఇలా పేర్కొన్నాడు. "భారతదేశాన్ని భారతీయుల సహాయంతో జయించవచ్చునని కనిపెట్టిన మొదటి పాశ్చాత్యుడు డూప్లే" **(Dupleix was the first Europeon who discovered that India can be conquered with the help of Indians).**

మనదేశాన్ని మనదేశీయుల సహాయంతోనే విదేశీయులు జయించడమనేది మనకత్యంత అవమానకరమైన చారిత్రక సత్యం. ప్రపంచంలో ఏదేశంలోనూ ప్రజలు తమకు తాము అపకారం చేసుకోరు; తమదేశానికి వ్యతిరేకంగా శత్రువులతో చేతులు కలపరు. కాని భారతదేశంలో మాత్రమే ఇలాంటి విపరీతాలు చాలా జరిగాయి.

మీర్ జాఫర్ ఇంగ్లీషువారితో లాలూచీ అయినందువలననే క్లైవుప్లాసీయుద్ధంలో సిరాజుద్దౌలాను ఓడించి బెంగాలును జయించగలిగాడు. అలాగే పీష్వారఘునాథరావు ఆంగ్లేయుల పక్షము చేరిన పిదప మాత్రమే మహారాష్ట్రరాజ్యంపై ఆంగ్లేయులు ఆధిపత్యం స్థాపించగలిగారు.

ఈరకంగా మనలోనే కొందరు విదేశీలతో చేతులు కలపడంవల్ల భారతదేశం పరాధీనమైనది. "ఎట్టిపరిస్థితిలోనూ నేను నాదేశానికి కీడు తలపెట్టను; స్వప్నంలో సహితం మాతృభూమియొక్క ఉన్నతినే కాంక్షిస్తాను" అని అనుకుంటున్నామా? "ఓ మాతృభూమీ, నీవు ప్రసాదించిన ఈ శరీరము నీక్షేమంకొరకే వినియోగపడుగాక!" అని మనసారా వాంఛిస్తున్నామా? ప్రతి భారతపౌరుడూ, తనను తాను అడగవలసిన ప్రశ్న ఇది.

---

* "ధనముతో ఎట్టి పనినైనా సాధించవచ్చునని అభిప్రాయంగలవారు ధనముకోసం ఎట్టిపనినైనా చేయడానికి వెనుదీయరని అనుమానించవచ్చు!" (హాలిఫాక్సు)

# మహాఃమంతో

## కులములు రెండే!

1893లో మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ ఒక భారతీయ వ్యాపారసంస్థపక్షమున న్యాయస్థానంలో వాదించడానికై దక్షిణాఫ్రికాకు వెళ్ళాడు. అప్పటికి ఆయన వయస్సు 24 సంవత్సరాలు మాత్రమే. దక్షిణాఫ్రికా ప్రభుత్వం అచటి భారతీయులను చాల అవమానాలకు గురిచేస్తుండేది. తెల్లవారు ఎక్కిన రైలుపెట్టెలో భారతీయులు ఎక్కడానికి వీలులేదు. ఆసియావాసుల రిజిస్ట్రేషనుచట్టము ప్రకారం భారతీయులందరూ తమ పేర్లను నమోదు చేయించుకోవాలి. అందుకు గాంధీజీ అసమ్మతి తెలుపుతూ శాంతియుతంగా సత్యాగ్రహోద్యమం నిర్వహించాడు.

దక్షిణాఫ్రికా ప్రధానమంత్రి జనరల్ స్మట్స్ తనతో సంభాషించడానికై గాంధీజీని ఆహ్వానించాడు. గాంధీజీ అతని వద్దకు వెళ్ళి దక్షిణాఫ్రికాలో భారతీయులు తెల్లవారిచేత చాల హీనంగా చూడబడుతున్నారనీ, మానవునికీ మానవునికీ మధ్య ఇటువంటి అడ్డుగోడలు ఉండరాదనీ నివేదించాడు.

అందులకు జనరల్ స్మట్స్ ఇలా అన్నాడు : "మిస్టర్ గాంధీ, ఈ దేశంలో ఆంగ్లేయులు మిమ్ములను హీనంగా చూస్తున్నమాట నిజమే. నేను ఒప్పుకుంటాను. కాని మీ దేశంలో కొన్ని కోట్లమందిని అంటరానివారుగా పరిగణించి ఊరి వెలుపల ప్రత్యేకప్రదేశాలలో నివసింపచేయడం లేదా?

మీ దేశంలో మీ ప్రవర్తన అలావుండగా, ఈ దేశంలో మమ్ము లను విమర్శించే హక్కు మీ కెక్కడిది?" అని ప్రశ్నించాడు.

గాంధీజీ మనస్సులో బాణమువలె ఈ ప్రశ్న గ్రుచ్చు కొన్నది. ఆయన భారతదేశానికి రాగానే భారతప్రజలలో అంటరానితనం తొలగింపచేయడానికై అహర్నిశలు కృషి చేశాడు. ఇదే సమస్యనుగూర్చి ప్రఖ్యాత తెలుగుకవి శ్రీ గురు జాడ అప్పారావుగారు ఇలా వ్రాశారు:

"మంచిచెడ్డలు మనుజులందున
యెంచిచూడగ రెండె కులములు
మంచి యన్నది మాలయైతే
మాలనే యగుదున్".

ఎంతటి ఆదర్శప్రాయమైన భావాన్ని కవి మనకందిం చాడు. ప్రజలలో అనేకవృత్తులవారుండవచ్చు; అనేక అభి రుచులు గలవారుండవచ్చు; విద్యావంతులు, విద్యాహీనులు వుండవచ్చు. వారివారి ప్రవర్తననుబట్టి, సమాజంలో వారికి మర్యాదలభిస్తుంది. అంతేగాని పుట్టుకనుబట్టి, కులమునుబట్టి ఒకరిని గౌరవించుట మరొకరిని ఈసడించుట తగదు. నిజానికి మంచి, చెడు అనే రెండుకులములు లేక తరగతులుమాత్రమే ప్రజల్లోవున్నాయి. మంచి అనేది మాల అయితే నన్ను నేను మాలవానిగనే భావించుకొంటాను. అని గురుజాడవారు చెప్పిన మాట మన మనసులలో నిరంతరమూ వెలుగొందుగాక!

ఆరోగ్య విశేషాలు :

## తేనె

80 సంవత్సరాల వయస్సుగల బెర్నార్డ్ మెక్ ఫాడెన్ అనువతడు విమానంలోనుండి పారా చూట్ ద్వారా క్రిందికి దుమికాడు. తాను తేనె విస్తారంగా పుచ్చుకుంటున్నానని అందుచేత దేహానికి వృద్ధాప్యంలోకూడ పటుత్వం సడలలేదని ఆయన సాక్ష్యమిచ్చాడు.

సుప్రసిద్ధ లండన్ వైద్యుడు సర్ ఆర్‌బుత్ నాట్‌లేన్ తేనెయొక్క గుణాన్ని శ్లాఘిస్తూ శరీరంలో అరిగిపోయిన సెల్స్‌ను తరిగిపోయిన శక్తిని పునరుత్పత్తి చేయడంలో తేనె యొక్క పాత్ర అమోఘమని చెప్పారు.

ఎవరెస్టు పర్వతారోహణలో విజయం సాధించిన సర్ ఎడ్మండ్ హిల్లరీ తేనెటీగలను పెంచుతారు. తేనె విస్తారంగా పుచ్చుకుంటారు.

తేనె దేహపు శిథిలావస్థను నిరోధిస్తుంది. అలసటను త్వరగా పోగొట్టుకొనదలిస్తే నిమ్మ లేక నారింజరసంలో తేనె కలుపుకొని త్రాగండి; లేదా నీటిలోగాని పాలలోగాని తేనె వేసుకొని త్రాగండి!

## మనవి

"యువభారతి"లో తమరచనలను ప్రచురించుటకు అను మతించిన రచయితలందరికీ మాధన్యవాదములు.

1969 అక్టోబరునుండి "యువభారతి" వెలువడుతున్నది. దీనిని ఉన్నతపాఠశాలల్లో తెప్పించుకొనుటకు డి. పి. ఐ. **Rc No 5763/CA 3/69 dated 27-12-69** ప్రకారము అనుమతించినారు.

ఈ పత్రికను రెండు విధాలుగా తెప్పించుకొనవచ్చు. సంవత్సరచందా రు. 1—50 లు పంపి ఒక్కొక్క కాపీ తెప్పించుకొనవచ్చు. ప్రతిహైస్కూలునుండి ఆవిధంగా కావలసిన కాపీలకు చందా చెల్లించవచ్చు.

మరొక మార్గం: ఎవరైన ఉపాధ్యాయులు 20 ప్రతులకు తక్కువగాకుండ ఎన్నిప్రతులైనను పంపమని మమ్ము కోరవచ్చు. మేము డిపాజిట్ అవసరంలేకుండా 21 ప్రతులు పంపుతాము. ఒక ప్రతిని విరామసమయంలో కోరిన విద్యార్థులకు చదివి వివరించి, ఆ 20 ప్రతులను 10 పైసలువంతున అమ్మించి, ఆ పైకం మనియార్డరు చార్జీలు తగ్గించుకొని మాకు పంపితే తరువాత నెల కాపీలు పంపుతాము. ఈ విధంగా రాష్ట్రంలో అన్ని జిల్లాలకూ 7000 ప్రతులు వెళుతున్నాయి. ఈరీతిలో

తాముకూడ పత్రికలు అధికసంఖ్యలో వెలువడడానికి సహాయ పడవచ్చు. కమిషన్ ఇవ్వబడదు.

"యువభారతి" పుస్తకాలు 10 తెప్పించేవారికి అందులో ఒకప్రతి ఉచితం. 9 పుస్తకాలఖరీదుకే 10 పుస్తకాలువస్తాయి. అపుడు పోస్టేజి మేమేభరిస్తాం.

"యువభారతి" పుస్తకాలను అధికసంఖ్యలో యువకులు చదవడానికిగాను మీసహాయం అర్థిస్తున్నాం! పత్రికలు రాష్ట్రంలో అన్ని హైస్కూళ్ళకు చేరడానికై మీతోడ్పాటు కోరుతున్నాం! ఈ పుస్తకం పలువురిచే చదివించండి. మీ అభిప్రాయాలు, సూచనలు "యువభారతి కార్యాలయం, 3/17 బ్రాడీపేట, గుంటూరు–2" కు వ్రాయగోరుతున్నాం!

—సంపాదకుడు